



పాపిన్స్ యోధులిద్దరు — జెట్ ఎక్కేరు
అఖండ ఆఫ్రికా— ఖండం చేరేరు



స్వాగతము పలికేడు—పెద్ద ఇద్దరికి
స్వయంగా చూసుకొంటా—నన్నాడు ఇద్దరిని



వేట మొదలయింది—
మీరూ చేరండి
వేటగాళ్ళతో—
వేడుక చూడండి



కోతులు చేరేయి చెట్లలో—
ఆరగింపను పళ్లు—కోతి
కిచకిచలతో—కొనలు మ్రోగేయి



చట్టున రామ్-శ్యామ్‌లను-చుట్టు ముట్టేయి
పట్టడవిలో కోతులు—పళ్ళు వెగటేసేయి



అడవి పళ్ళొక యెత్తు—పాపిన్స్ బిళ్ళలొక
యెత్తు—పాపిన్స్ మజా ఎరిగి—
కోతులు పరవశించేయి.



నోరూరించే మనసుదోచే మైమరపించే
పార్లే పాపిన్స్
పండ్ల రుచిగల పిప్పరమెంట్లు
5 పళ్ళ స్వాదులు-రాస్ప్‌బెరి,
అనాస, నిమ్మ, నారింజ,
మోసంబి.
13 బిళ్ళలు ప్రతి ప్యాకెట్‌లో
PARLE
POPPINS
FRUITY SWEETS

# సరిగ్గా ఆడాడు...

























ఫోర్‌హాన్స్
దంతవైద్యుడిచే సృష్టింపబడిన పేస్ట్

# చిక్‌లెట్స్®

## ఇప్పుడు 4 గల ప్యాకులో కూడ!

ధర 25 పైసలు




అవును, చిక్‌లెట్స్ యిప్పుడు 4 బిళ్లలు గల క్రొత్త
ప్యాకులో కూడ లభిస్తున్నాయి. ధర 25 పైసలు మాత్రమే.
చూయింగ్ గమ్ యెప్పుడు ఇల్లా గమ్మత్తుగా ఉంటుంది: ఎందుకంటే, అది
ఎందుకొందుకు పేలుగా వివిధ ప్యాకీలలో లభిస్తోంది. చిక్‌లెట్స్ 4 గల ప్యాకు మీకు
యిష్టమైన పెప్పర్‌మింట్, ఆరెంజ్, టూటీ-ఫ్రూటీ మరియు పైనాపిల్
రుచులలో లభిస్తోంది.

**చిక్‌లెట్స్** పేరుకతో వుంటే చూయింగ్ గమ్-విటమిన్లు ఎ & డి సమృద్ధిగా మరియు కేల్షియమ్ కలవి.

WH-6453

# పెరిగే వయస్సుకు ప్రియ మిత్రము-ఇన్‌క్రీమిన్*!




ఉప్పొంగే జీవితం. పెల్లుబికే శక్తి సంపూర్ణమైన ఆరోగ్యం! పెరిగే వయస్సులో మీ పిల్లలకు ఇన్‌క్రీమిన్ టానిక్ ఇవ్వండి. ఇన్‌క్రీమిన్ సిరప్‌లో ఉపయోగకరమైన విటమిన్లు, ఐరన్ మరియు అవసరమైన అమినో ఏసిడ్-పెరిగే వయస్సులో ముఖ్యమైనవి అన్నీ వున్నాయి.

## ఇన్‌క్రీమిన్*

**ఇన్‌క్రీమిన్ టానిక్-పెరిగే పిల్లలకు వరప్రసాదం!**

డాక్టర్లు విశ్వసించే పేరు Lederle ఎ డివిజన్ ఆఫ్ సయానమిడ్ ఇండియా లిమిటెడ్

* అమెరికన్ సయానమిడ్ కంపెనీ వారి రిజిష్టర్డ్ ట్రేడ్ మార్కు

SISTAS-INC-3068A TEL



# చందమామ

సంస్థాపకుడు : నాగిరెడ్డి
సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ నెల బేతాళకథ [ "పొగొట్టుకొన్న అవకాశం" ] కె. నాగేశ్వరరావు రచన.

"దుర్బుద్ధి" అన్న చినా కథలో అంతా భ్రమే. కాని భ్రమలు ప్రాణాలు తియ్యగల వన్నది భ్రమ కాదు. భ్రమను ఆశించి రాజు తన కుడి భుజాల వంటి వాళ్ళను హత్యా చేసి, తానూ మరణిస్తాడు. ఎడారిలో ఎండ మావుల కోసం పరిగెత్తి చనిపోయే వారికీ, ఈ రాజుకూ తేడా ఏమీ లేదు. వాస్తవ జీవితంలో కూడా ఇలా జరగటం మనం చూస్తాం.

సంపుటి 53 అక్టోబర్ '73 సంచిక 4






విపక్ష మఖిలి కృత్య ప్రతిష్ఠా ఖలు దుర్లభా;
అనీత్వా పంకతాం ధూళిం ఉదకం నావతిష్ఠతే. 1

(మాఘుడు)

[శత్రువును నిర్మూలించకుండా నిలవదొక్కుకోవటం అసాధ్యం. ధూళిని బురదగా అణగదొక్కిన మీదనే నీరు నిలవ గలుగుతుంది.]

సుఖం హి దుఃఖా న్యనుభూయ శోభతే
ఘనాంధకారే ష్వివ దీపదర్శనం;
సుఖాత్తు యో యాతి నరో దరిద్రతాం
మృత శ్శరీరేణ ధృత స్స జీవతి. 2

(శూద్రకుడు)

[దుఃఖాలు అనుభవించిన తరవాత సుఖం కలిగితే, అంధకారంలో ఉన్నవాడికి దీపం కనబడినట్టు శోభగా ఉంటుంది. సుఖం అనుభవించిన తరవాత దుఃఖం అనుభవించటం శరీరంతో జీవించినా చావులాటిదే.]

సహసా విదధీత న క్రియాం;
అవివేకః పరమాపదాం పదం;
వృణతే హి విమృశ్యకారిణం
గుణలుబ్ధాః స్వయ మేవ సంపదః. 3

(భారవి)

[ఏ పనీ తొందరపడి చేయరాదు. అన్ని ఆపదలకూ అవివేకమే మూలం. విమర్శించి పనిచేసే గుణవంతులను సంపదలు తామే వరిస్తాయి.]



# యక్షపర్వతం

## 17

[గురుభల్లూకుణ్ణి వెంటబెట్టుకుని, ఖడ్గజీవదత్తులు అరణ్యంలోని కొలను దగ్గిరకు వెళ్ళారు. అక్కడ వారికి స్వర్ణాచారి కనిపించాడు. సమరబాహు లేని సమయంలో అతడి అనుచరులకూ, వీరపురంరాజు సైనికులకూ దొమ్మియుద్ధం ప్రారంభమైంది. రాజ సైనికులు కత్తులు దూసి, సమరబాహు అనుచరుల మీదికి బయలుదేరారు. తరవాత—]

వీరపుర రాజుగారి జంతు ప్రదర్శనశాలాధికారి వెంట యిప్పుడు ఏడుగురు సైనికులు మాత్రమే వున్నారు. వాళ్ళల్లో ఒకడు సమరబాహు అనుచరులవల్ల గాయపడి కుంటుతూ తతిమ్మావాళ్ళ వెనగ్గా వస్తున్నాడు. సమరబాహు అనుచరులు నలుగురూ రాజసైనికులు తమకన్న కొంచెం అధికంగా వున్నా, ధైర్యంచేసి వాళ్ళ మీద కలియబడేందుకు తయారయారు.

జంతు ప్రదర్శన శాలాధికారి, సమరబాహు అనుచరులకు కొద్ది దూరంలో ఆగి, "ఒరే, మీ వాలకం చూస్తూంటే, మీరేదో బిడారు వర్తకుల్లా కనిపిస్తున్నారు. నెత్తి మీద పాగా చుట్టుకునే పద్ధతదేనా? కత్తి పట్టే తీరుకూడా మీకు తెలిసినట్టులేదే!" అన్నాడు ఎంతో హుందాతనం కనబరుస్తూ.

ఈ మాటలు సమరబాహు అనుచరులకు అవమానకరంగా తోచి, చాలా కోపం



తెప్పించినై. వాళ్ళు నలుగురూ మీసాలు దువ్వి, ఒక్కసారిగా పెద్ద పెడబొబ్బ పెట్టి, "మా కత్తి దెబ్బ ఎలాంటిదో రుచిచూసిన నీ సైనికులు ముగ్గురు యీ ప్రాంతాలే నేలకరిచి వున్నారు. భూమ్మీద నూకలుండి కాస్తలో తప్పుకున్న మరొకడు నీ వెనకాలే కుంటుతూ వస్తున్నాడు. ఇప్పుడు కాచుకోండి! సమరబాహుకూ, జై! కొండకోట నగరానికీ, జై!" అంటూ దూకుడుగా వచ్చి, వీరసింహుడి సైనికుల మీద పడ్డారు.

ఆ తరవాత సమరబాహు అనుచరులకూ, వీరసింహుడి సైనికులకూ మధ్య ఎంతోసేపు యుద్ధం జరగలేదు. వీరసింహుడి సైనికుల్లో ముగ్గురు మొదటి తాకిడికే, సమరబాహు అనుచరుల కత్తి దెబ్బలకు నేల కొరిగారు. లోగడ గాయపడిన సైనికుడూ, జంతు ప్రదర్శనశాలాధికారీ వెనుదిరిగి చెట్లకు అడ్డంపడి పారిపోసాగారు. తమపై అధికారి పారిపోవటం చూసిన, మిగతా ఇద్దరూ కత్తులు కింద పడవేసి సమరబాహు అనుచరులకు లొంగిపోయారు.

ఈ జరిగిన చిన్న బొమ్మ యుద్ధంలో తాము సాధించింది స్వల్ప విజయమే అయినా, సమరబాహు అనుచరులు నలుగురూ ఎక్కడలేని ఆనందంతో కత్తులు పైకెత్తి, "సమరబాహు మహారాజుకూ, జై!" అంటూ అరణ్యం దద్దరిల్లేలా కేకలు పెట్టారు.

సమరబాహు అనుచరుల కేకలూ, అంతకు ముందు జరిగిన పోరాటంలో రేగిన రణగొణ ధ్వనులూ విని, ఏమి జరుగుతున్నదో చూద్దామని కొందరు ఆటవికులు ఆ ప్రదేశానికి వచ్చారు. వాళ్ళకు లొంగిపోయి తలలువంచుకు నిలబడివున్న వీరసింహుడి సైనికులూ, కత్తు లెత్తి కోలాహలం చేస్తున్న సమరబాహు అనుచరులూ కనిపించారు.

ఆటవికులకు ఎవరెవరి మధ్య పోరాటం జరిగిందో, ఎవరు ఓడి ఎవరు గెలిచారో అర్థంకాలేదు. వాళ్ళకు వీరసింహరాజుగారి సైనికులు తెలుసు. ఇప్పుడు వాళ్ళు,

కత్తులు పడవేసి నిలబడివున్న ఆ సైనికు లను చూస్తూనే, మరేదో రాజుగారి సైనికులు వాళ్ళను యుద్ధంలో జయించారని భావించారు. ఈ కొత్త రాజసైనికులెవరు?

సమరబాహు అనుచరులు ఆటవికుల ఆశ్చర్యం గమనించి, "మీరీ అరణ్యంలో నివసించే వాళ్ళేగదా? ఇకనుంచి మీరు వీరపురం రాజుకు కప్పం కట్టనవసరం లేదు. మా రాజైన సమరబాహు మీ అందరి మీదా అధికారి. ఆయన్నే మీరు రాజుగా గుర్తించి కప్పం చెల్లించండి, తెలిసిందా?" అన్నారు ఆజ్ఞాపిస్తున్నట్టు.

ఆటవికుల్లో కొంచెం వయసు మళ్ళిన వాడొకడు ముందుకొచ్చి, "అయ్యా, మీరు చెప్పినట్టే చేస్తాం. మా వాళ్ళల్లో వీరపురం చూసినవాళ్ళూ, ఆఖరుకు ఆ నగరాన్నేలే వీరసింహ మహారాజును చూసినవాళ్ళూ కూడా కొందరున్నారు. కోప్పడకండి—తమ నగరం ఎక్కడ?" అని అడిగాడు భయం భయంగా.

సమరబాహు అనుచరుల్లో ఒకడు చేయెత్తి దూరంగా వున్న కొండల కేసి చూపిస్తూ, "అదుగో, ఆ చెట్ల చాటున కనిపిస్తున్నవే, ఆ కొండల మీదే మా కోట వున్నది. కావాలంటే మీలో కొందరు మా వెంట వచ్చి, ఆ దారిమార్గం ఒకసారి చూసి, మీ మీ గూడేలలో మేం చెప్పిన



సంగతులన్నీ అందరికీ తెలిసేలా టమటమా వేయండి," అన్నాడు.

ఆటవిక ముసలాడు ఏదో చెప్పబోయేంతలో దూరంగా గుర్రాలు సకిలించిన ధ్వని అయింది. అది వింటూనే సమరబాహు అనుచరులు అదిరిపడ్డారు. వాళ్ళల్లో ఒకడు ఆ ధ్వనివచ్చిన వైపు కేసిచూస్తూ, తన మిత్రులతో, "అరెరె! పెద్ద పొరబాటు జరిగిపోయింది. శత్రువుల్లో యిద్దరు తప్పించుకుని పారిపోయారు. ఆ గుర్రాలు వాళ్ళు తెచ్చినవే అయివుంటవా? మరి కొందర్ని కూడగట్టుకుని వాళ్ళు మన మీదికి తిరిగి యుద్ధానికి రావటం లేదు గదా!" అన్నాడు.



ఈ అనుమానం కలగ్గానే సమరబాహు అనుచరులు నలుగురూ, ఆత్మరక్షణకు సన్నద్ధులయారు. కాని, ఒకటీ రెండు క్షణాలు జరిగీ జరక్కముందే ఇద్దరు ఆటవికులు, రెండు గుర్రాలను కళ్ళాలు పట్టుకుని వాళ్ళున్న చోటుకు తీసుకువచ్చారు.

ఏం జరిగిందో తెలియక సమరబాహు అనుచరులు కళ్లప్పగించి చూస్తూన్నంతలో, ఆటవిక ముసలాడు, గుర్రాలు తెచ్చిన వాళ్ళను, "ఇదేమిటి? వీటిని మీ రెక్కడ పట్టుకున్నారు?" అని అడిగాడు.

"వీరపురం రాజుగారి సైనికుల్లో ఇద్దరు గుర్రాలెక్కి పారిపోతూ, ఆ దాపుల చెట్లకు కట్టి వున్న మిగతా గుర్రాల తాళ్ళను కత్తులతో నరికి, వాటిని దూరంగా తరిమేయాలని చూశారు. మేం వాటిల్లో యీ రెంటినీ తరిమి, లాఘవంగా పట్టుకున్నాం," అన్నారు గుర్రాలను తెచ్చిన ఆటవికులు.

"మా రాజుగారికి చెప్పి, మీ లాఘవానికి తగిన బహుమతి యిప్పిస్తాం. ఈ గుర్రాలు రెంటినీ మా వెంట కొండకోట నగరానికి పట్టుకురండి," అన్నాడొక సమరబాహు అనుచరుడు.

ఆటవికులిద్దరూ అందుకు అంగీకరించారు. సమరబాహు అనుచరులు తమకు బందీలుగా దొరికిన వీరసింహుడి సైనికులిద్దరినీ వెంటబెట్టుకుని, తమ బంటెలున్న చోటుకు బయలుదేరారు. హఠాత్తుగా వాళ్ళ వెనక వస్తున్న ఆటవికుడొకడు, "అయ్యా, బోనుల్లో వున్న సింహం, పులుల మాటేమిటి? అడవి పక్షులు కొన్ని వలల్లో చిక్కుకుని చెట్టుకొమ్మల నుంచి వేళ్ళాడుతున్నవి—వాటినీ అక్కడే వదిలేయదలిచారా?." అని అడిగాడు.

ఈ ప్రశ్న వింటూనే సమరబాహు అనుచరులు ఠక్కున ఆగిపోయి, బందీలయిన వీరసింహుడి సైనికులను ఆ మృగాలను గురించీ, పక్షులను గురించీ అడిగారు. సైనికులు తాము జంతుప్రదర్శనశాలాధికారితో అరణ్యానికి వచ్చిన పని సంగతి వాళ్ళకు చెప్పి, ఆ సింహాన్నీ పులుల్నీ,

పక్షుల్నీ తామే పట్టుకున్నామని తెలియ పరిచారు.

"బావుంది! ఈ పశుపక్ష్యాదులన్నీ సమరబాహు మహారాజుగారి జంతుప్రదర్శన శాలలో సుఖంగా జీవిస్తాయి. రండి, వాటిని కొండకోట నగరానికి తీసుకుపోదాం," అన్నారు సమరబాహు అనుచరులు.

ఈ సారి సమరబాహు అనుచరుల వెంట ఆటవికులంతా బయలుదేరి వచ్చారు. ఆటవికుడు చెప్పినట్టు బోనులో చిక్కిన సింహం, దాని చువ్వలను కాళ్ళతో కొడుతూ, నోటితో కొరుకుతూ భీకరంగా గర్జిస్తున్నది. పులులు కూడా తాము చిక్కిన బోనుల్లో నుంచి భయంకరంగా అరుస్తూ, నానా గొడవా చేస్తున్నవి. ఇక వలల్లో చిక్కి, చెట్లకొమ్మలకు వేలాడదీయబడిన అడవి పక్షుల రొద అంతా యింతా కాదు.

సమరబాహు అనుచరులు వాటన్నిటినీ పరీక్షగా చూసి, "అంతా బాగానే వుంది. మేమేనాడూ క్రూర మృగాలను మచ్చిక చేసిన వాళ్ళం కాదు. ఈ బోనుల్ని కోట దగ్గిరకు ఎత్తుకు పోవటం ఎట్లా?" అన్నారు.

ఆటవికుల్లో కొందరికి సమరబాహు అనుచరులు ఎక్కి వచ్చిన ఒంటెలను చూసినప్పుడే, వీళ్ళు యీ ప్రాంతపు వాళ్ళు కాదన్న అనుమానం కలిగింది. బోనుల్లో వున్న మృగాలను గురించి వాళ్ళన్న మాట వినగానే, ఆటవిక ముసలాడు ముందుకు వచ్చి, "అయ్యా, ఆ బోనులన్నీ చిన్న చక్రాల బళ్ళమీద అమర్చినవి, కొంచెం





కొండమీద రాళ్ళను అటూ యిటూ మోయిస్తూ, కోట గోడలు కట్టిస్తున్న స్వర్ణాచారి కొండ దిగువున కనిపించిన ఒంటెలనూ, గుర్రాలనూ, వాటి వెంట వున్న ఆటవికులనూ చూసి, ఎక్కడలేని ఆశ్చర్యంతో, "ఇదేమిటి? మనవాళ్ళిద్దరు గుర్రాలెక్కి వస్తున్నట్టున్నది. వెంట ఆ బోను లెందుకు? ఆటవికుల ముఠా కూడా కనబడుతున్నది — ఇంతకూ అరణ్యంలో ఏమి జరిగినట్టు? ఈ ఉదయం వేటకు పోయింది మనవాళ్ళు నలుగురేగదా?" అన్నాడు, రాళ్ళు మోస్తున్న సమరబాహు అనుచరులతో.

సమరబాహు అనుచరులు మోసే మోసే రాళ్ళను కింద పడవేసి కొండ అంచుకు వచ్చి, దిగువనున్న గుర్రాలకేసీ, ఆటవికుల కేసీ వింతగా చూడసాగారు. గుర్రాలమీద వున్న సమరబాహు అనుచరుడొకడు, తల ఎత్తి పైకి చూసి, స్వర్ణాచారీ వాళ్ళు తమ కేసే ఒక చోట గుంపుగా చేరి చూడటం గమనించి, తన స్నేహితులతో, "ఒరే, ఆచార్య మహామంత్రిగారు మనల్ని చూసి అద్భుతపడిపోతున్నట్టున్నది. ముందుగా పోయి ఆయనకు సంగతి సందర్భాలు మనవి చేస్తాను," అంటూ గుర్రం మీంచి దిగి, రాళ్ళ మీదుగా గెంతుతూ పోయి, స్వర్ణా చారిని సమీపించాడు.

జాగ్రత్తగా చూడండి. మీరు వాటిని గుర్రాల చేతగాని, ఒంటెల చేతగాని, మీ నగరానికి లాగించుకుపోవచ్చు." అన్నాడు.

"అలా అయితే, ఆ పనేదో మీరే చేసి, సహాయపడండి. ముందు ముందు మీకు మా రాజుగారి నుంచి మంచి ప్రతిఫలం వుంటుంది," అన్నాడొక సమరబాహు అనుచరుడు.

ఆటవికులు సింహం, పులులూ వున్న బోనులను తాళ్ళతో రెండు ఒంటెలకు కట్టారు. మరొకదాని వీపు మీద అడవి పక్షులున్న వలలను బిగించారు. తరవాత అందరూ కలిసి, సమరబాహు కొండమీద కోట కడుతున్న ప్రాంతానికి బయలుదేరారు.

స్వర్ణాచారి తనకేసి వస్తున్న సమరబాహు అనుచరుణ్ణి, "మీరు పోయింది వేటకు గదా? ఆ గుర్రాలెక్కడివి? ఏవో పులి బోనులు తెస్తున్నారేమిటి? ఆ ఆటవికులు యిక్కడికెందుకొస్తున్నట్టు?" అని అదుర్దాగా ప్రశ్నించాడు.

సమరబాహు అనుచరుడు స్వర్ణాచారి దగ్గరకు పోయి నమస్కరించి, "ఆచార్య మహామంత్రీ! మేము అరణ్యంలో వీరపురం రాజు సైనికులను బాహాబాహి యుద్ధంలో చిత్తుగా ఓడించాం. ఇద్దర్ని బందీలుగా పట్టుకున్నాం. ఏడుగుర్ని నిలువునా నరికేశాం. ఇద్దరు మాత్రం ప్రాణాలతో వాళ్ళ వీరపురం కేసి పారి పోయారు," అని చెప్పాడు.

ఇద్దరు ప్రాణాలతో వీరపురం కేసి పారి పోయారని వింటూనే స్వర్ణాచారి నిలువెల్లా కంపించిపోయాడు. అతడికి సమరబాహు అనుచరుడు చెప్పిన మిగతా విజయాలేవీ ఆనందం కలిగించలేదు. ముందూ వెనకలు ఆలోచించకుండా సమరబాహు అనుచరులు వీరపురం రాజసైనికులతో తగువుపెట్టుకొని తమందర్నీ గొప్ప విపత్తులో ముంచబోతున్నారని అతడనుకున్నాడు.

స్వర్ణాచారి కోపంతో కళ్ళెర్ర చేసి, సమరబాహు అనుచరుడితో, "వీరసింహుడి సైనికులిద్దరు ప్రాణాలతో వాళ్ళ నగరం



కేసి పారిపోయారని చెప్పావ్! అదే, త్వరలో మనకు ప్రాణ సంకటంగా పరిణమించవచ్చు. ఏదో యజ్ఞాశ్వాలను పట్టుకున్నంతగా సంతోషపడిపోతూ, దొరికిన ఆ కుంటి గుర్రాలను రెంటినీ యిక్కడికి వెంటబెట్టుకొస్తున్నారా? అసలా రాజు సైనికులతో మీ రెందుకు కలహం పెట్టుకున్నారు?" అన్నాడు.

సమరబాహు అనుచరుడు స్వర్ణాచారి కోపం చూసి, తాము చేసింది తప్పు పని అయి వుంటుందని గ్రహించి, ఉన్నవీ లేనివీ కొన్ని కల్పించి అతడికి చెప్పాడు. వాళ్ళు సమరబాహును అవమానిస్తూ మాట్లాడారనీ, గుంపుగా వచ్చి ఒంటెల

మీద పడి తేలుకు పోతూంటే, వాళ్ళతో కలియబడవలసి వచ్చిందనీ — యిలాగే మరికొన్ని అబద్ధాలు చెప్పాడు.

అంతా విని స్వర్ణాచారి కొంచెంసేపు ఆలోచిస్తూ వూరుకుని, తరవాత అక్కడ చేరిన సమరబాహు అనుచరులందర్నీ ఉద్దేశించి, "ఏది ఏమైనా, మనకు సరి అయిన రక్షణలులేని యీ సమయంలో, ఆ వీర పుర రాజుతో విరోధం రావలసిందికాదు. ఆ పారిపోయిన ఇద్దరూ ఆ రాజుకు జరిగిందంతా చెపుతారు. రాజు స్వయంగానో, సేనాని నాయకత్వం కిందో పెద్ద సైన్యాన్ని పంపి, ఇంకా నిర్మాణ దశలోనేవున్న మన కోటను ముట్టడిస్తాడు. సమయానికి సమరబాహు రాజిక్కడ లేడాయె! ఆ క్షత్రియ మహాయోధులైన ఖడ్గజీవదత్తులున్నా, మనం ఎలాంటి ప్రమాదాలనైనా గడిచే వాళ్ళం," అన్నాడు.

స్వర్ణాచారి యిలా చెప్పిం తరవాతగాని సమరబాహు అనుచరులకు తమకు రానున్న ప్రమాదం ఎంతటి భయంకరమైనదో అర్థం కాలేదు. వాళ్ళు దిగులు పడిపోయి ఒకరి ముఖాలొకరు చూసుకోసాగారు.

స్వర్ణాచారి ఊహించినట్టే, అరణ్యంలో సమరబాహు అనుచరులకు దొరక్కుండా గుర్రాల మీద పారిపోయిన, జంతు ప్రదర్శనశాలాధికారీ, సైనికుడూ, వీరపురనగర రాజ వీధి గుండా నురుగులు కక్కుతున్న తమ గుర్రాలను దౌడు తీయిస్తూ, "దేశానికి ప్రమాదం! రాజ్యానికి ముప్పు! శత్రురాజు అరణ్యంలో ఆకాశాన్నంటే కోట గట్టి, మన మీదికి సేనావాహినులను తరలించుకు వస్తున్నాడు!" అని కేకలు వేయసాగారు.

ఆ మాటలు విన్న నగర పౌరుల్లో కొందరు వీధుల్లో అక్కడక్కడా చేరి తమ నగరానికి పట్టనున్న దుర్గతిని గురించి చర్చిస్తూ, భయకంపితులై పోసాగారు. మరి కొందరు జనాన్ని నగర రక్షణకోసం కత్తులూ, ఈటెలూ, గొడ్డళ్ళూ—ఏది దొరికితే అది తీసుకుని సర్వసన్నద్ధంగా వుండమని కేకలు వేస్తూ, వీధుల వెంట పరిగెత్తసాగారు. —(ఇంకావుంది)





# పోగొట్టుకొన్న అవకాశం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువు ఈ నిశిరాత్రివేళ ఇలా శ్రమపడుతూ, తెలియకుండా ఎన్ని మంచి అవకాశాలను పోగొట్టు కుంటున్నావో తెలియదు. కాని తనకు దొరికిన గొప్ప అవకాశాన్ని బుద్ధి పూర్వకంగా పోగొట్టుకున్న దయానిధి అనే వాడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

దయానిధి తండ్రి ఒక ప్రసిద్ధ నౌకా వ్యాపారస్థుడు. అయన తన జీవితమంతా దేశాంతరాలతో వర్తకం చేసి కోట్లు గడించాడు. అయనకు దయానిధి ఒక్కడే సంతానం. అందుచేత దయానిధి తన అడుగుజాడలలో నౌకా వ్యాపారం కొన

## బేతాళ కథలు



సాగించి, తనకన్న కూడా పేరు ప్రతిష్ఠలూ, ధనమూ గడించి, తన పేరు నిలబెడతాడని తండ్రి ఆశపడ్డాడు.

అయితే దయానిధి మరొక విధంగా తయారయాడు. అతనికి వర్తకం పట్ల ఏమీ ఆసక్తి లేదు. తన తండ్రి సంపాదించిన ధనమే ఏంచేసుకోవాలో అతనికి తెలియదు. అతనికి చిన్నతనం నుంచీ వైద్యశాస్త్రం అంటే అపారమైన అభిరుచి. అందుచేత అతను దొరికిన వైద్యగ్రంథమల్లా చదివి, వేలాది ఓషధుల కోసం వెతికి, వాటితో ఔషధాలు తయారు చెయ్యటం జీవితాశయంగా పెట్టుకున్నాడు. తండ్రి అనంతరం తాను ఉన్నది పెట్టుకుని తింటూ, ఎవరెవరికి ఏ రోగం వచ్చినా చికిత్స చేసి, తన జీవితమంతా రోగనిర్మూలనలో గడుపుదామని అతను అనుకున్నాడు.

దయానిధికి తండ్రి ఎన్ని విధాలనో చెప్పి చూశాడు, కాని అతని మనసు వర్తకం కేసి మళ్ళించలేక పోయాడు. తన కొడుకు మందుల పిచ్చిలో పడి జీవితమంతా వ్యర్థం చేసుకుంటాడన్న బెంగతోనే దయానిధి తండ్రి ముసలితనంలో మరణించాడు.

తండ్రి చనిపోగానే దయానిధి పెద్ద ధర్మవైద్యశాల కట్టించి, అక్కడికి వచ్చిన వారందరికీ చికిత్సలూ, వైద్యసౌకర్యాలూ కలిగించాడు. ఇందుకు అయిన ఖర్చు తన తండ్రి సంపాదించిన ధనంలో వెయ్యో వంతు కూడా లేదు; తన తండ్రి ఎందుకు అంతగా బాధపడ్డాడో దయానిధికి అర్థం కాలేదు.

ధర్మవైద్యశాలలో చికిత్సలు పొందటం గొప్పవారికి నామోషీ అయింది. కాని దేశం లోని బీదా బిక్కీ వేల సంఖ్యలో వచ్చి, తమ రోగాలకు సరి అయిన చికిత్సలు పొంది వెళ్ళుతూ ఉండే వాళ్ళు. ఆ కారణంగా దయానిధి పెట్టిన వైద్యశాలకు గొప్ప కీర్తీ, హస్తవాసి గల వైద్యుడుగా దయానిధికి గొప్ప పేరూ వచ్చాయి.

అయితే దయానిధి చేసే పని రెండు రకాల వాళ్ళకు నచ్చలేదు. వైద్యం వృత్తిగా

గలవారికి చాలా నష్టం కలిగింది. ధనికులు ఇంకా తమచేత వైద్యం చేయించుకుంటు న్నప్పటికీ, వారు నయం చేయలేని రోగా లను దయానిది నయం చెయ్యటం కొన్ని సందర్భాలలో జరగటం వల్ల, తమకు ముందు ముందు అపాయం ఉన్నదని వృత్తివైద్యులు గ్రహించారు.

దేశంలోని వర్తక శ్రేష్ఠులకు కూడా దయానిధి చేసే పని నచ్చలేదు. వాళ్ళు ధనం కూడబెట్టి ప్రతిష్ఠ పొందిన వాళ్ళు. దయానిది లోకోపకారానికి ఉన్న ధనం ఖర్చుపెట్టి తమకన్న పదింతలు కీర్తి సంపాదిస్తున్నాడు. అంతేగాక, ధయానిధి లాగా మిగతా వర్తక శ్రేష్ఠులు కూడా ఏదో ఒక మంచి పనికోసం ధనం వెచ్చించి ప్రజలకు తోడ్పడరేమని కొందరు ప్రశ్న లేవదీయసాగారు.

ఈ విధంగా వైద్యులకూ, వర్తకులకూ కూడా దయానిధి కంటకంగా తయారై కూర్చున్నాడు. వాళ్ళు అతన్ని ఎలా నాశనం చెయ్యాలా అని చూస్తున్నారు. ఇంతలో ఆ రాజ్యాన్ని ఏలే సామంతరాజు చనిపోయి, అతని కొడుకు రాజయ్యాడు. ఈ కొత్త రాజు ఆశాపాతకుడు. అతను రాజ్యానికి వస్తూనే ధనికులందరి వద్దా ఏదో రూపంలో, ఏవేవో కారణాలు చెప్పి, ధనం పిండ సాగాడు. అతని ఈ దుర్బుద్ధిని అవకాశంగా తీసుకుని కొందరు వైద్యులూ, కొందరు వర్తకులూ రాజు వద్దకు వెళ్ళి, దయానిధి ఎవరివద్దా వైద్య శిక్షణ పొందకుండానే





ధర్మ వైద్యశాల ఒకటి పెట్టి, వేలాది ప్రజలను ఆకర్షించి, ఇవ్వగూడని మందు లిచ్చి, ప్రజలను చంపేస్తున్నాడని ఫిర్యాదు చేశారు. దయానిధి వద్ద అంతులేని ధనమూ, అతనికి అనేక భవనాలూ, తోటలూ, ఇతర ఆస్తి ఉన్నట్టు తెలిసింది. సామంతరాజు మారుమాటాడకుండా దయానిధికి ఉన్న ఆస్తి యావత్తూ స్వాధీన పరుచుకుని, ధర్మ వైద్యశాల మూయించి, అతనికి దేశ బహిష్కరణ విధించాడు.

దయానిధి హతాశుడైనాడు. ధర్మ వైద్యశాల మూతబడుతున్నందుకు బీదప్రజలు గగ్గోలు పెట్టారు. కాని వారి మొర ఆలకించే వారు లేరు.

దయానిధి దేశం వదిలిపెట్టి పోవాలి కనక అతను సముద్ర తీరాన్ని చేరుకున్నాడు. అక్కడ ఒక ఓడ సముద్ర ప్రయాణానికి సిద్ధంగా ఉన్నది. దాని యజమాని అయిన వర్తకుడు, దయానిధి ఫలాని వర్తకుడి కొడుకని తెలియగానే, అతన్ని తన ఓడలో ఎక్కించుకుని, అతని కథ అంతా విని, అతన్ని అతని ఇష్టం వచ్చిన రేవులో దించటానికి ఒప్పుకున్నాడు.

కాని ఇదంతా అనుకున్నట్టు జరగలేదు. సముద్ర మధ్యంలో ఆ ఓడ తుపాను దెబ్బకు గురి అయి, పగిలి, మునిగి పోయింది. దయానిధికి ఓడ తాలూకు పలక ఒకటి దొరికింది. అతను ఆ పలక మీద పడుకుని, చాలా రోజుల పాటు తేలి ఉండి, స్పృహలేని స్థితిలో ఒక తీరానికి కొట్టుకు వచ్చాడు.

అతను చేరినది ఒక పెద్ద దీవి. అందులో ఉండే వారంతా ఆదిమవాసులు. స్పృహ లేకుండా ఒడ్డున పడివున్న దయానిధిని ఒక పిల్ల చూసి, అతని నోట కాస్త నీరు పోసి, అతని ముఖాన నీరుచల్లి, అతనికి స్పృహ తెప్పించింది. తరవాత ఆమె అతనికి తాగటానికి జావ తెచ్చి ఇచ్చింది. అది తాగాక కొంత సత్తువ వచ్చి, దయానిధి ఆమె వెంట ఒక పల్లెకు నడిచి వెళ్ళాడు. అక్కడ అతని చుట్టూ

జనం మూగారు. వారంతా ఆదిమవాసులే. వారికి నాగరికత ఏమీ తెలియదు. కాని వారి మధ్య ఎక్కువ తక్కువలు లేవు. వారికి సరి అయిన బట్టలు లేవు; ఆకుల తోనూ, చెట్టు పట్టతోనూ తయారు చేసిన బట్టలలాటివి ధరిస్తారు. వాళ్ళు ఏవో ధాన్యాలు పండిస్తారు. ఆ ధాన్యమూ, చెట్ల కాయలూ, వేటాడిన మృగాల మాంసమూ తిని జీవిస్తారు.

త్వరలోనే దయానిధి వాళ్ళ భాష నేర్చుకుని, వాళ్ళతో కలిసిపోయి, వాళ్ళ జీవితమే జీవిస్తూ, వాళ్ళలో ఒకడయి పోయాడు. తనకు మొట్టమొదట ఉప చారాలు చేసిన అమ్మాయినే అతను పెళ్ళి కూడా చేసుకున్నాడు.

ఆ దీవి మీద నివసించే వాళ్ళకు సాధార ణంగా వచ్చే వ్యాధి చూపు పోవటం. అందుకు కారణమేమిటని అతను అడిగితే, కొద్ది సంవత్సరాలకొకసారి అంటువ్యాధి లాగా అనేకమందికి ఏదో కళ్ళ జబ్బు వస్తుందనీ, అది సోకిన వారు చాలావరకు గుడ్డివాళ్ళయిపోతారనీ, బహు కొద్దిమంది మాత్రమే ఆ వ్యాధి నుంచి కోలుకుంటారనీ చెప్పారు.

"నీకు కూడా కళ్ళు పోవచ్చు." అన్నది దయానిధి భార్య.

"భయం లేదు. ఏ వ్యాధి వచ్చే వాతా వరణంలో ఆ వ్యాధిని నయం చేసే ఓషధులు పెరుగుతాయి. నాకు వైద్యం తెలుసు. ఈ సారి ఈ జబ్బు వచ్చేలోపుగా





ఔషధాలు అక్కడి మూలికలతోనే తయారు చేసి, వారి ఆరోగ్యాన్ని కాపాడుతూ వచ్చాడు.

ఒకరోజు దయానిధీ, అతని భార్యా పొలంలో పనిచేస్తూ ఉండగా ఆ తీరానికి ఒక నౌక నీరు కోసం వచ్చింది. నౌక యజమాని మరికొందరు నావికులతో లంక లోకి వచ్చాడు. అతను దయానిధిని చూస్తూనే గుర్తుపట్టి, కౌగలించుకుని, "నువు బతికే ఉన్నావా? ఈ దిక్కుమాలిన చోట ఎలా వచ్చి పడ్డావు? ఆ ఓడ మునిగి పోయినప్పుడు అందులో ఉన్నవారంతా చచ్చిపోయారన్నారే?" అన్నాడు.

దయానిధి తన మిత్రుడికి జరిగినదంతా చెప్పాడు. అప్పుడు అతని మిత్రుడు ఇలా చెప్పాడు:

"నువు దేశం విడిచినాక చాలా మార్పులు జరిగాయి. మన సామంతుణ్ణి గురించి చక్రవర్తికి చాలా ఫిర్యాదులు వెళ్ళాయి. వాటితోబాటు నీకు జరిగిన అన్యాయం కూడా ఆయనకు తెలిసింది. చక్రవర్తి రహస్యంగానూ, బహిరంగంగానూ అన్ని విషయాలూ ఆచూకీ తీసి, సామంతుకు మరణదండన విధించి, మన ప్రాంతానికి కొత్త రాజును ఏర్పాటు చేశాడు. నీకు విధించబడిన శిక్షలన్నీ రద్దు అయాయి. ఈ అడివిమనుషుల మధ్య ఉండే పనే లేదు నీకు. వచ్చి, నీ ఆస్తి అంతా అనుభ

దానికి ఔషధం తయారు చేస్తాను," అన్నాడు దయానిధి.

అతను వెంటనే తన భార్యతో సహా అక్కడి కొండల్లో తిరిగి కొన్ని మూలికలు సంపాదించి, వాటి గుణాలను పరిశీలించి, కొన్ని ఔషధాలు తయారుచేసి ఉంచాడు. అంతలోనే ఆ వ్యాధి సోకింది. అతను జబ్బు చేసిన వారందరికీ తన ఔషధాలు ఇచ్చాడు. చాలామంది గుడ్డితనం రాకుండా తప్పించుకోగలిగారు.

అది మొదలు ఆ దీవిలో వాళ్ళందరూ అతన్ని దేవుడల్లే చూడసాగారు. దయానిధి ఆ జాతి వాళ్ళకు వచ్చే ఇతర రోగాలన్నిటిని గురించీ వివరాలు తెలుసుకుని వాటికి

వించు. మళ్ళీ ధర్మ వైద్యశాల సాగించు. నా నౌకలోనే వచ్చెయ్యి. నేను మన దేశమే పోతున్నాను."

ఎంతో ఉత్సాహంగా మిత్రుడు చెప్పిన దంతా విని దయానిధి, "నేను ఈ లంక వదిలి రాను. నీకు కావలసిన నీరూ, ఆహారమూ ఇప్పిస్తాను," అన్నాడు.

దయానిధికి ఓడ ప్రమాదం మూలంగా మతి పోయి ఉంటుందని అతని మిత్రుడు శంకించాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, దయానిధి తన మాతృ దేశానికి వెళ్ళి, ధనంతో తులతూగుతూ, వేలాది ప్రజలకు వైద్య సహాయం చేస్తూ, హాయిగా జీవించే అవకాశం దొరికినా అతను దాన్ని ఎందుకు విడిచిపెట్టాడు? అంతకంటె ఆ ఆదిమ వాసుల మధ్య అనాగరికంగా జీవించటమే మేలని అతనికి ఎందుకు అనిపించింది? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "దయానిధి మనస్తత్వం సంపదలలో ఓలలాడటంతో తృప్తిపడేది కాదు. అతని కష్టాలన్నిటికీ మూలం అతను ధనవంతుడు కావటమే. అతని ఆత్మసంతృప్తి రోగాలను నయం చెయ్యడంలో మాత్రమే ఉన్నది. అతనికి కష్టాలు తెచ్చిన రాజు మారాడే గాని, ఆ రాజును ప్రేరేపించిన ధనికులూ, వృత్తి వైద్యులూ ఉండనే ఉన్నారు. అందుచేత తన మాతృదేశంలో అతని ఆశయం నిర్విఘ్నంగా కొనసాగదు. ఈ ఆదిమ సమాజంలో డబ్బు ప్రసక్తి లేదు. అతను ఎంత విజయవంతంగా వైద్యం చేస్తే ప్రజలు అంత ఆప్తుడుగా చూస్తారు. ఈ జీవితంలో ధనపిశాచి లేదు. అందుకే దయానిధి ఆ దీవిలోని ఆదిమవాసుల మధ్య ఉండిపోవటానికి నిర్ణయించాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)



# ఎవరు గొప్ప?

ఒక ఊళ్ళో రంగమ్మా, మంగయ్యా అని ఇద్దరు దంపతులు ఉండేవారు. రంగమ్మ పెద్ద గయ్యాళి. మంగయ్య పరమ కోపిష్టి. అందుచేత వాళ్ళు అస్తమానమూ, నేను గొప్ప అంటే, నేను గొప్ప అని తగాదా పడేవాళ్ళు.

ఈ తగాదా వాళ్ళ మధ్య తేలక ఒకసారి వాళ్ళిద్దరూ గ్రామపెద్ద వద్దకు వెళ్ళి, "భార్యా భర్త లిద్దరిలో ఎవరు గొప్ప?" అని అడిగారు.

"దాని కొక చిన్న కథ ఉన్నదే! అది వింటే మీకే తెలిసిపోతుంది," అని గ్రామ పెద్ద వాళ్ళకు ఇలా చెప్పాడు.

ఇద్దరు భార్యా భర్తలు దూరప్రయాణం చేస్తూ, ఒక మర్రిచెట్టు కింద విశ్రమించారు. భర్త భార్య తొడపై తలపెట్టుకు పడుకున్నాడు. అప్పుడొక మర్రికొమ్మ విరిగి వారిపై పడసాగింది. అది చూసి భార్య ఒక వెంట్రుక విసిరి ఆ కొమ్మను దూరంగా పడేటటు చేసింది. అందుచేత ఎవరు గొప్పో మీరే తెలుసుకోవచ్చు నన్నాడు గ్రామపెద్ద.

"ఇంకేం? భార్యే గొప్పది," అన్నది రంగమ్మ.

"కాదు, అంత గొప్ప భార్య చేత సమస్త ఉపచారాలూ పొందే భర్తే గొప్పవాడు," అన్నాడు మంగయ్య.






# నిజమైన సన్యాసి

ఒక ఊళ్ళో ఒక గొప్ప సన్యాసి ఉండే వాడు. ఆయన ఇంద్రియాలను జయించిన మహా జ్ఞాని అని చెప్పుకునే వారు. ఆయన వద్ద ఆనందుడూ, భైరవుడూ అనే ఇద్దరు శిష్యులు చేరారు. వాళ్ళు తనవద్దకు వచ్చిన రోజునే సన్యాసి వాళ్ళకు రెండు కర్తవ్యాలు చెప్పాడు: స్త్రీనీ, ధనాన్నీ తాకరాదు; ఆపదలో ఉన్నవారిని శాయశక్తులా ఆదుకోవాలి.

ఈ నియమాలలో మొదటిది వ్యక్తిని కష్టాలనుంచి కాపాడుతుంది; రెండవది జీవితాన్ని సార్థకం చేస్తుంది అని సన్యాసి వారికి తెలియజెప్పాడు. సన్యాసి చెప్పిన నియమాలలో శిష్యు లిద్దరికీ గురికుదిరింది. వాళ్ళు తమ జీవితమంతా సన్యాసి వద్దనే ఉండి పోవటానికి నిశ్చయించుకున్నారు.

ప్రతి ఉదయమూ వాళ్ళు ముగ్గురూ నదికి పోయి, స్నానంచేసి వచ్చేవారు. అప్పుడు సన్యాసి తన శిష్యులకు జ్ఞానబోధ చేసేవాడు. అనంతరం ముగ్గురూ ఊళ్ళోకి వెళ్ళి, భిక్షాటన చేసి, కుటీరానికి తిరిగివచ్చి, భోజనం చేసేవారు. మధ్యాన్నం శిష్యులు తమ పాఠాలను వల్లె వేసుకునే వారు. తిరిగి సాయంకాలం నదీస్నానమూ, అధ్యయనమూ, భిక్షాటనా జరిగేవి.

రోజులాగే ఒకనాడు సన్యాసీ, భైరవుడూ, ఆనందుడూ భిక్షాటనకు బయలుదేరి. గ్రామంలో మూడు వైపులకు వెళ్ళారు.

ఆనందుడు ఒక సందులోకి తిరగగానే అక్కడ ఒక కుర్రవాడు ఏడుస్తూ నిలబడి కనిపించాడు. ఆనందుడు ఆగి, ఎందుకు ఏడుస్తున్నావని వాణ్ణి అడిగాడు. కుర్రవాడు తన సంగతి ఇలా చెప్పాడు:

వాడు ఒక ధనికుడి ఇంట పనిచేస్తూ ఉంటాడు. యజమాని వాడికి ఒక బంగారు గొలుసు ఇచ్చి, దాన్ని కంసాలి చేత బాగు

"వసుంధర"



27

చేయించి తీసుకురమ్మన్నాడు. కుర్రవాడు ఈ సందు చివరకు వచ్చేసరికి, ఎవడో దొంగ వాడిచేతిలో గొలుసు లాక్కుని పారి పోయాడు. గొలుసు పోయిందంటే యజ మాని తాట ఒలిపించేస్తాడని భయపడి కుర్రవాడు ఏడుస్తున్నాడు.

దొంగ ఎటు వెళ్ళాడో అడిగి తెలుసు కుని ఆనందుడు కుర్రవాడితో సహా అటుకేసి పరిగెత్తాడు.

కొంతసేపటికి ఒక వ్యక్తి తాపీగా నడుస్తూ వాళ్ళకి కనిపించాడు.

"ఆ ఎర్రపంచ కట్టుకున్నవాడే దొంగ!" అన్నాడు కుర్రవాడు.

ఈ మాట చెవిన పడగానే దొంగ పరుగు లంకించుకున్నాడు. ఆనందుడు అతి వేగంగా పరిగెత్తుతూ వాణ్ణి తరుముకుంటూ వెళ్ళాడు.

ఈ సమయంలో భైరవుడు అటుగా వచ్చి, ఆనందుడు పరిగెత్తటం చూసి, విషయమేమిటని కుర్రవాణ్ణి అడిగాడు. కుర్రవాడు బంగారు గొలుసు దొంగతనం గురించి చెప్పాడు.

ఆనందుడు ఆ దొంగను పట్టుకుని బంగారు గొలుసు తీసుకుంటాడేమో, బంగారాన్ని తాకుతాడేమోనని భైరవుడికి భయం వేసింది. బంగారాన్ని తాకరాదని గురువుగారు చెప్పారు. అందుచేత భైరవుడు కూడా ఆనందుడి వెనకగా పరిగెత్తాడు.

దొంగ చాలాదూరం పరిగెత్తి ఒక కాలువ వద్ద ఆగిపోయాడు. అది చిన్న కాలువే



గాని, దూకి దాటదగినంత చిన్న కాలువ కాదు. ఏం చెయ్యాలో నిర్ణయించుకునే లోపల ఆనందుడు వచ్చి దొంగను పట్టుకున్నాడు. ఆనందుడు దృఢమైన మనిషి, దొంగ బక్కవాడు. అందుచేత దొంగ ఆనందుడితో కయ్యంపెట్టుకోక, అతనికి బంగారు గొలుసు ఇచ్చేసి, దణ్ణం పెట్టి, చెంపలు వాయించేసుకున్నాడు. ఆనందుడు వాణ్ణి వదిలిపెట్టేశాడు.

ఇంతలో భైరవుడు అక్కడికి వచ్చి చేరి, ఆనందుడి చేతిలో గొలుసు చూసి, "ఎంత పని చేశావు, ఆనందా! బంగారాన్ని తాకావు!" అన్నాడు.

ఆనందుడు ఏదో జవాబు చెప్పబోతూండగా వాళ్ళకు ఒక స్త్రీ కంఠం వినిపించింది. ఆనందుడు అటు తిరిగి చూసేసరికి, కాలువ అవతలి పక్క ఒక అందమైన స్త్రీ నిలబడి ఉండి, తాను కాలువ దాటటానికి సహాయం చెయ్యమని కోరింది.

స్త్రీ కనపడగానే భైరవుడు ముఖం పక్కకు తిప్పుకున్నాడు. ఆనందుడు మటుకు నడుము లోతుగల ఆ కాలవలోకి దిగి, అవతలికి వెళ్ళి, ఆమెను తన చేతులతో ఎత్తుకుని, ఇవతలి ఒడ్డుకు తీసుకు వచ్చి, గట్టు మీద దించాడు. ఆమె అతనికి తన కృతజ్ఞత తెలుపుకుని తన దారిన తాను వెళ్ళిపోయింది.

భైరవుడు ఆనందుడితో మాట్లాడలేదు. ఆనందుడు బంగారాన్ని తాకినందుకు పశ్చాత్తాపపడకపోగా స్త్రీని కూడా తాకి,



గురువు చెప్పిన మొదటి నియమాన్ని పూర్తిగా ఉల్లంఘించాడు. ఆనందుడు మాత్రం బంగారు గొలుసును కుర్రవాడికి తిరిగి ఇచ్చి, భిక్షాటనకు వెళ్ళిపోయాడు.

భైరవుడు రోజుకన్న ముందుగా కుటీరానికి వచ్చి, సన్యాసి తిరిగిరాగానే జరిగినదంతా ఆయనకు చెప్పేశాడు.

సన్యాసి నవ్వి, "ఆనందుణ్ణి రానీ, విచారిద్దాం," అన్నాడు.

ఆనందుడు రాగానే, "ఆనందూ, నేను చెప్పిన నియమాలను గుర్తుంచుకునే భిక్షాటన చేశావా?" అని అడిగాడు సన్యాసి.

అవునన్నాడు ఆనందుడు.

"విశేషాలేమైనా ఉన్నాయా?" అని సన్యాసి మళ్ళీ అడిగాడు.

"ఇద్దరు వ్యక్తులను అవసరంలో ఆదుకోగలిగాను," అన్నాడు ఆనందుడు.

"ఎవరు వాళ్ళు?" అని సన్యాసి ఇంకోసారి అడిగాడు.

"ఎవరైనదీ నేను సరిగా గమనించలేదు. ఒకరిది ఆపద, మరొకరిది అవసరం. వాళ్ళకు నా చేతనైన సహాయం చేశాను. ఎవరితోనూ బంధాలు ఉంచుకోరాదని సెలవిచ్చారు గదా? వాళ్ళను గురించి అప్పుడే మరిచిపోయాను," అన్నాడు ఆనందుడు.

"సరే, వెళ్ళి కాళ్ళు కడుక్కురా. భోజనం చేతాం," అని సన్యాసి ఆనందుణ్ణి అవతలికి పంపి, భైరవుడితో, "చూశావా? ఆనందుడు నిజమైన సన్యాసి. నేను చెప్పిన నియమాలను అతను బాగా అర్థం చేసుకున్నాడు. స్త్రీనీ, ధనాన్నీ తాక వద్దంటే నా ఉద్దేశం వాటిని కోరవద్దని. అతను కోరిక లేకుండానే బంగారాన్నీ, స్త్రీనీ కూడా తాకాడు. నువు వాటిని తాకకపోయినా బంగారం బంగారమన్నమాటా, స్త్రీ స్త్రీ అన్న మాటా మరిచిపోలేకుండా వున్నావు! అతను చేతితో తాకి మరచిపోయిన వాటిని నువు ఇంకా నీ మనస్సుతో తాకుతూనే ఉన్నావు," అన్నాడు.

భైరవుడు తన తప్పు తెలుసుకుని, సిగ్గుతో తలవంచుకున్నాడు.





# సోమశర్మ

భోజరాజు తన ఆస్థానంలో వందలాది కవులను పోషించటమేగాక, తన ఆస్థానానికి ఎక్కడినుండి విద్వత్కవి వచ్చినా అతని దారిద్ర్యం తొలగించి, సన్మానించి పంపే వాడు. కాని కాళిదాసు డొక్క శుద్ధి ఏ మాత్రమూ లేని దరిద్ర బ్రాహ్మణులను కొందరిని మహా మేధావులుగా రాజు దగ్గిర ప్రదర్శించి, తన తెలివి తేటలతో వారికి ధనం ఇప్పించగలిగాడు.

అలాటి నిరక్షర కుక్షులలో సోమశర్మ అనే బ్రాహ్మణుడు ఒకడు. ఈ సోమశర్మ పరమ దరిద్రుడు. చదువుసంధ్యలు రానివాడు. తనవంటి మూర్ఖులకు కూడా కాళిదాసు రాజుగారి చేత బహుమానాలిప్పించినట్టు విని ఆ సోమశర్మ కాళిదాసు వద్దకు వెళ్ళి, తన కష్టాలన్నీ చెప్పుకుని, తనకు కూడా రాజుగారి చేత ఏదైనా బహుమానం ఇప్పించమని కాళ్ళా వేళ్ళా పడ్డాడు.

"నువు ఏం చదువుకున్నావు? నీకు ఏ కళలో ప్రవేశం ఉన్నది?" అని కాళిదాసు సోమశర్మను అడిగాడు.

సోమశర్మ సిగ్గుపడుతూ, "నేనేమీ చదువుకోలేదు. రాజాస్థానంలో బహుమానం పొందటానికి నాకు ఏ అర్హతా లేదు. మీరు నాకు ఏదన్నా ఇప్పిస్తే నేనూ, బండెడు సంసారమూ బతుకుతాం," అన్నాడు.

"అయ్యా, భోజరాజుగారు విద్వాంసులకూ, ముఖ్యంగా కవిత్వం చెప్పగల వారికీ బహుమానాలిస్తారు. అయినా నేను చెప్పినట్టు చేస్తే ఫలితం ఉండవచ్చు. నిన్ను భోజరాజుగారు పిలిపించే ఏర్పాటు నేను చేస్తాను. ఆయన పిలిపించినప్పుడు వచ్చి, ఒక వెలగపండు ఆయన ముందు ఉంచి, 'గా రాయః,' అని ఆశీర్వదించు. ఆ పైె సంగతి నేను చూస్తాను," అన్నాడు కాళిదాసు.

ఎస్. గోపాలకృష్ణ

ఆ రోజు సభలో కాళిదాసు భోజరాజుతో మాట్లాడుతూ, రాజు చాలా ఉల్లాసంగా ఉన్న సమయంలో, "అన్నట్టు, మన ఆస్థానానికి ఒక పండితుడు వచ్చి ఉన్నాడు. ఆయన మహా పండితుడుగానూ, గొప్ప శాస్త్రవేత్తగానూ కనబడతాడు," అని మాట వరసగా అన్నాడు.

వెంటనే భోజరాజు ఆ పండితుణ్ణి పిలిపించమన్నాడు. కాళిదాసు సోమశర్మ కోసం ఒక భటుణ్ణి పంపాడు. ఆ భటుడు సోమశర్మను ఒక పల్లకిలో కూర్చోబెట్టి తెచ్చాడు.

పల్లకీ నుంచి దిగుతూండగా సోమశర్మకు ఆ సమీపంలో ఒక ఒంటె కనిపించింది. ఎన్నడూ ఒంటెను చూసి ఉండని సోమశర్మ, "అది ఏ జంతువు ? " అని అక్కడ ఉన్న వారిని అడిగాడు.

" అది ఉష్ట్రం," అని వాళ్ళు చెప్పారు.

మూర్ఖుడైన సోమశర్మ కాళిదాసు చెప్పిన మాటతో పాటు ఉష్ట్రం అనే మాట కూడా కలిపి మననం చేసుకుంటూ రాజు సన్నిధికి వచ్చి, వెలగపండు రాజు ముందుంచి, " ఉ శ ర ట గా రా యః " అని ఆశీర్వదించాడు.

ఆ ఆశీర్వాదానికి అర్థం తెలియక సభలో వారంతా తెల్లబోయారు. భోజరాజు కాళిదాసుతో, "ఈ పండితుల వారి ఆశీర్వాదానికి అర్థం ఏమిటై ఉంటుంది?" అని అడిగాడు.

కాళిదాసు ఇలా శ్లోకం చదివి,

" ఉమయా సహితో దేవ
శ్శంకర శ్శూలపాణినా
రక్షతు త్వాం హి రాజేంద్ర!
టకారో ఘనగర్జనః,

అంటే ఉ (ఉమ) తో కూడిన శ (శంకరుడు) ర (రక్షించుగాక !). ట (టటట) మని ఉరుముతూ మేఘాలు వర్షించుగాక ! ఇలా ఈ మహాపండితుడు తమరిని ఆశీర్వదిస్తున్నాడు. ఆ సంగతి స్పష్టంగా తెలుస్తూనే ఉన్నది గద ! " అన్నాడు.

రాజు పరమానంద భరితుడై సోమశర్మను సత్కరించి, ధనం ఇచ్చి పంపేశాడు. సోమశర్మ కాళిదాసుకు కృతజ్ఞత తెలుపుకుని సుఖంగా జీవించాడు.





# పిసినిగొట్టు — గ్రామస్థులు

కోశల అనే గ్రామంలో రామనా అనే పిసినిగొట్టు ఉండేవాడు. అతను ఇరుగు పొరుగు వాళ్ళకు డబ్బు అప్పుపెట్టి దారుణంగా వడ్డీ వసూలు చేసేవాడు. అతను పరమ క్రూరుడు. డబ్బుతప్ప అతనికి జీవితంలో మరేదీ లేదు. బాకీలు తీర్చలేని వాళ్ళ ఇళ్ళూ, వాకిళ్ళూ స్వాధీనం చేసుకునేవాడు. ఈ విషయంలో అతనికి నా వాళ్ళు అన్న విచక్షణకూడా లేదు. అతను తన ఒక్క కూతురికీ పెళ్ళి చేసి పంపేసి, ఆమెనూ, అల్లుణ్ణీ తన ఇంటికి తిరిగి పిలిచిన పాపాన పోలేదు. తన భార్యను తిండి పెట్టకుండా చంపేశాడు. తన తండ్రి రోగంతో మంచాన పడితే వైద్యం లేకుండా చావనిచ్చాడు. రామనా కడుపునిండా తిండీ, ఒంటినిండా బట్టా కట్టి ఎరగడు, తన తండ్రి ఏ నాడో కట్టించిన ఇంటిని మరమ్మతు చేయించి ఎరగడు.

అలాటి పరమ నీచుడైన రామనాను గ్రామస్థులు మనస్ఫూర్తిగా ద్వేషించేవారు. అక్కరపడి డబ్బు కావలిసిన వాడు తప్ప అతని గడప ఎవరూ తొక్కేవారు కారు.

మందూ మాకూ లేకుండా అతని తండ్రి చావటం చూడగానే గ్రామస్థులకు అతని మీద క్రోధం పుట్టుకొచ్చి, అతనికి బాగా బుద్ధి చెప్పాలనుకున్నారు. సోమనాథు డనే తెలివైన కుర్రవాడు ఈ నిర్ణయం తన మిత్రులకు తెలిపాడు. అతను తన మేనమామ వద్ద ఇంద్రజాల విద్యలు చాలా నేర్చాడు.

"నిజమేరా, సోమనాథూ, రామనా అంత కంతకూ మితిమీరి పోతున్నాడు. కాని అతనికి బుద్ధి చెప్పటం ఎలా? అతని దగ్గిర డబ్బున్నది. డబ్బున్నవాడు శక్తిమంతుడే గద!" అన్నాడు గ్రామ పెద్ద రాఘవుడు.

ఏ. సి. సర్కార్, ఇంద్రజాలికుడు

"అదంతా ఏమీ లేదులే, బాబాయ్. నేను మంచి పథకం ఆలోచించాను. మనకు కావలిసిన పని అంతా రామనా తండ్రి దయ్యమై చేస్తాడు. బతికి ఉండగా తండ్రిని లక్ష్యపెట్టని రామనా, దయ్యమైన తండ్రి ఆజ్ఞలను నిర్లక్ష్యం చెయ్యటానికి సాహసించలేడు," అన్నాడు సోమనాధుడు.

"అదెలా?" అని అందరూ ఆశ్చర్యంగా అడిగారు.

సోమనాధుడు రహస్యంగా మిగిలిన వారికి తన పథకం వివరించి చెప్పాడు. ఆ పథకం పారుతుందనీ, రామనాను మభ్య పెట్టి గ్రామానికి కొత్త పాఠశాలా భవనం కట్టించ వచ్చుననీ వారికి నమ్మకం కలిగింది.

రామనా తండ్రిని ఊరి బయట, ముక్తా పూర్‌కు వెళ్ళే దారిలో, ఒక రొంపి సమీ పంలో దహనం చేశారు. రామనా కొన్ని బాకీలు వసూలు చేసుకోవటానికి ముక్తాపూర్ వెళ్ళి, వెన్నెల రాత్రివేళ తిరిగి వస్తున్నాడు. బాకీ వసూలుతో వడ్డీ మొత్తం చాలా వచ్చిన ఆనందంలో అతను తన గార్దభ కంఠం ఎత్తి గట్టిగా పాడుతూ మైదానం మీదుగా వస్తున్నాడు. రొంపిని సమీపిస్తుండగా అతనికి కొద్దిగా భయం పట్టుకుని మరింత గట్టిగా పాడసాగాడు. అతని తండ్రి దహనం అయినచోట పెద్ద వటవృక్షం ఉన్నది. రామనా అక్కడికి వచ్చేసరికి ఒక కొమ్మ విరిగి అతని ముందు పడింది. రామనా దడుచుకున్నాడు. అతనికి మర్రిచెట్టు



నీడలో అటూ ఇటూ ఆడుతూ తెల్లగా ఏదో కనిపించింది. అతను వణక నారంభించాడు.

ఇంతలో అతనికి బొంగురుగా కొన్ని మాటలు వినిపించాయి.

"నీ తండ్రినిరా... రామనా!... నీ తండ్రి... మదనుణ్ణి! చచ్చినా — నాకు —శాంతి లేదు ... దాహం ... దాహం.... దాహం! కొడుకు ధర్మం—నెరవేర్చు— నా దాహం—తీర్చు. నువు నాకు పెట్టిన శ్రాద్ధం – సక్రమంగా లేదు. సరిగా శ్రాద్ధం పెట్టు. గౌతమ భట్టును పిలు - శాస్త్రం తెలిసినవాడు. అతని సలహా తీసుకో, నాకు నీరు ఇయ్యి. దాహం! అంతులేని దాహంతో తపిస్తున్నాను. గొంతుక పిడచకట్టు తున్నది. కాపాడు—నీ తండ్రిని కాపాడు."

రామనా హీనస్వరంతో, "చాలా ఖర్చవుతుంది. నేను ఖర్చుపెట్ట లేను. అసంభవం," అన్నాడు.

"అసంభవమా ? – చెయ్యలేవా? ఏమిటి నువ్వనేది?" అన్నదా గొంతు. అదే సమయంలో చెట్టుకొమ్మలలో కలవరం పుట్టింది. మరొక కొమ్మ విరిగిపడింది.

"నా మాట వినకపోయావో నీ గొంతు నులిమేస్తాను. నా కొడుకువని చూడనురా, మూర్ఖుడా!" అన్నదా కంఠం భయంకరంగా.

ఈ మాటలను తట్టుకోలేక రామనా భయంతో మూర్ఛపోయాడు.

అప్పుడు రాఘవుడు మొదలైనవారు తాము దాగి ఉన్న చోట్లనుండి బయటికి వచ్చి, రామనాను అతని ఇంటికి మోసుకు





ఆ ముగ్గురూ తమను తాము అభినందించు కున్నారు. ముఖ్యమైన కార్యక్రమ మంతా ముందే ఉన్నది.

రామనాను ఇంటికి మోసుకు పోయిన రాఘవుడు మొదలైన వారు అతన్ని ముందుగా వైద్యుడు అశ్విని ఇంటికి తీసుకు పోయారు. అశ్విని రామనా ముక్కులో రెండు చుక్కల పసరు వేశాడు. రామనా గట్టిగా తుమ్మి కళ్ళు తెరిచి, "నేనెక్కడ ఉన్నాను?" అని అయోమయంగా అడిగాడు. అతని కంఠం ఇంకా కంపిస్తూనే ఉన్నది. అతను బెదురు బెదురుగా చుట్టూ కలయజూశాడు.

పోయారు. వాళ్ళు వెళ్ళిపోతూండగా సోమ నాధుడూ, అతని మిత్రులైన దేవాశీషుడూ, శుభజితుడూ చెట్టు దిగారు. వాళ్ళే చెట్టుమీద దాగి ఉండి తతంగమంతా నడిపించారు. సోమనాధుడి చేతిలో వెడల్పయిన మూతిగల గొట్టం ఉన్నది. శుభ జితుడు చేతిలో చిన్న రంపం ఉన్నది. దేవాశీషుడు ఒక పెద్ద, తెల్లని గాలిపటం పట్టుకుని ఉన్నాడు. చెట్టు నీడలో తెల్లగా అటూ ఇటూ ఆడిన వింత వస్తువు ఆ గాలి పటమే. సోమనాధుడు గొట్టంలో నుంచి మాట్లాడాడు. శుభజితుడి పని కొమ్మలు నరికి కింద వెయ్యటం. ఇంతవరకు తమ కార్యక్రమం జయప్రదంగా సాగినందుకు

"నీకేం జరిగింది? నువు రొంపి వైపు నుంచి పెట్టిన కేకలు మాకు ఊళ్ళోకి వినిపించి, పరిగెత్తు కుంటూ వచ్చాం," అన్నాడు రాఘవుడు.

"ఆగావేం, మామా? మనం అక్కడికి వెళ్ళేసరికి ఏం కనిపించిందో అదికూడా చెప్పు! మనం ఇతని తండ్రిని చూడ లేదూ?" అన్నాడు సోమనాధుడు.

"అవునవును. మదన పెదనాన్న నీ తల దగ్గిర కూర్చుని నిన్ను నిమురుతూ మాకు కనిపించాడు. నువు చచ్చిపోయావే అను కున్నాం. మేం తిరిగి పోబోతుండగా మదన పెదనాన్న లేచినిలబడి, 'విను, రాఘవా! మీరంతా వినండర్రా! నా కొడుకు నన్ను

సరిగా చూడక చంపేశాడు. చచ్చినా నా ఆత్మకు శాంతి లేకుండా ఉన్నది. దాహంతో తపించి పోతున్నాను, తపించి పోతున్నాను! ఈ పిసినారి వెధవను ఊళ్ళోకి చేర్చండి. వీడు మూర్ఛపోయాడే గాని ఇంకా ప్రాణం ఉన్నది. బతికున్నంత కాలమూ వీడు డబ్బు పోగుచేశాడు. ఒక్క సత్కార్యానికి ఒక్క దమ్మిడీ ఖర్చు చెయ్యలేదు. ఇరుగు పొరుగు వాళ్ళపట్ల దారుణంగా ప్రవర్తించాడు. ఆలికి అన్నం పెట్టలేదు. నన్ను సరిగా చూడలేదు. కన్న కూతుర్నే కనికరించడు. వీడి పాపమే నన్నింకా వెంటాడుతున్నది. నాకు శాస్త్రోక్తంగా శ్రాద్ధం పెట్టమనండి. శ్రాద్ధానికి గౌతమ భట్టును పిలవమనండి. రామనా తన ప్రవృత్తి మార్చుకున్నాడంటే, శ్రాద్ధం పెట్టినప్పుడు అందరూ చూస్తూండగా నేను నీరు తాగుతాను. అలా చేయకపోయాడో నా దాహం తీరదు! నా ఆత్మకు శాంతి ఉండదు; నా ఆగ్రహం వాణ్ణి నాశనం చెయ్యకుండా ఎవరూ ఆపలేరు,' అని చెప్పాడు. ఇలా చెప్పి మదన పెదనాన్న చెట్ల గుబురుల్లోకి అంతర్ధానమయాడు. నిన్ను మేం గ్రామానికి మోసుకొచ్చాం," అని గ్రామ పెద్ద రాఘవుడు ముగించాడు.

రామనా కొంతసేపు ఏదో ఆలోచించి, "మనం గౌతమభట్టు ఇంటికి పోయి, నాయన శ్రాద్ధం గురించి మాట్లాడదాం. పదండి. రేపో, ఎల్లుండో శ్రాద్ధం పెట్టాలి," అన్నాడు గంభీరంగా.




అన్ని ఏర్పాట్లూ చేసి, రామనా తన తండ్రి శ్రాద్ధం ఘనంగా పెట్టాడు. గ్రామస్థులందరికీ భోజనాలు జరిగాయి. శ్రాద్ధం తంతు పూర్తి అయినాక రామనా ఒక లోటాలో నీరు తెచ్చి దేవుడి మందిరం ముందు పెట్టి, ఆ నీరు తాగమని తన తండ్రిని వేడుకున్నాడు. కాని లోటాలో నీరు అలాగే ఉండిపోయింది. అందులో ఒక చుక్క కూడా తరగలేదు.

భయపడి, నిరాశచెంది రామనా ఏడవనారంభించాడు.




"ఇప్పుడేం చెయ్యాలి? నా తండ్రి తృప్తి కోసం ఎంతో డబ్బు తగలేశాను. అంతా వృధా అయిపోయింది. ఆయన ఇంకా నా పట్ల సుముఖుడు కాలేదు. నీరు అలాగే ఉన్నది, తరగలేదు. ఆయన దాహం తీరలేదు. తాగుతానన్న వాడు తాగటం లేదు. చెయ్యమన్నదంతా చేశాను గదా! నా వల్ల ఏం తప్పు జరిగింది?"

ఇంతలో బయట ఏదో కలకలం అయింది. శుభజితుడు లోపలికి పరిగెత్తు కుంటూ వచ్చి, "సోమనాథుడికి ఏదో అయింది. వాడు స్పృహలేకుండా బయట నేల మీదపడి కాళ్ళూచేతులూ ఆడిస్తూ దొర్లుతున్నాడు," అన్నాడు.

సోమనాథుణ్ణి శ్రాద్ధం జరిగే చోటికి మోసుకు వచ్చారు. అతను చేతులూ, కాళ్ళూ కొట్టుకుంటూ హీనస్వరంతో, "నీ తండ్రినిరా, రామనా! నువు చేసిన దానికి సంతోషించాను గాని, నీ స్వభావం మార్చుకున్నావు కావు. ఈ శ్రాద్ధానికి నీ కూతుర్నీ, అల్లుణ్ణీ, ఇతర బంధువులనూ ఎందుకు పిలిచావు కావు? ఇంకో పని కూడా చెయ్యి. గ్రామంలో బడికి పూరి పాకా ఉన్నది. నా పేర దానికి మంచి భవనం కట్టించు. అలా చేశావంటే నా దాహం తీర్చుకుంటాను," అన్నాడు.

అంతలో పూనకం దిగిపోయినట్టున్నది. సోమనాథుడు పెదవులు వణికించి, గట్టిగా ఊపిరి విడిచి, క్రమంగా కళ్ళు తెరిచి, ఆశ్చర్యంగా చూస్తూ, "నేనెక్కడ ఉన్నాను?" అన్నాడు.

"మా నాన్న దాహం ఎలా తీర్చు కుంటాడో నీకేమైనా చెప్పాడా?" అని రామనా అతన్ని అడిగాడు.

"అన్నట్టు, చెప్పాడు. కాని ఆయన చెయ్యమన్నదంతా నువు చేస్తేనేగాని నా వల్ల ఏమీ కాదు. ఆయన ఏం కోరాడో నీకు తెలుసా?" అని సోమనాథుడు రామనాను అడిగాడు.

రామనా వెంటనే బండి పంపి, తన కూతుర్నీ, బంధువులనూ రప్పించాడు;

బడి భవనానికి ఎంత అవుతుందని అతను అడిగితే, ముప్పై వేలు చాలునని రాఘవుడు అన్నాడు.

"ఆ బడికి మదన స్మారక పాఠశాల అని పేరు పెట్టాలి," అన్నాడు రామనా. అందుకు గ్రామస్థులందరూ సంతోషంగా సమ్మతించారు.

ఇప్పుడు చనిపోయిన వాడి ఆత్మ నీరు తాగి దాహం తీర్చుకునే ఘట్టం వచ్చింది.

సోమనాధుడు దేవుడి మందిరం ముందు ఒక పళ్ళెంలో తాగే నీరు పోసి ఉంచాడు. అతను పక్క గదికి వెళ్ళి ఒక కంచు లోటాతో తిరిగి వచ్చి, అందరూ చూస్తూండగా దాన్ని నీరున్న పళ్ళెం మీద బోర్లించాడు. వెంటనే ఒక అద్భుతం జరిగింది: పళ్ళెంలోని నీరంతా మాయమైపోయింది; అదే సమయంలో ఎవరో ఆ నీటిని పీల్చిన ధ్వని కూడా వినపడింది.

సోమనాధుడు ఆ పళ్ళాన్ని లోటాతో సహా అలాగే పట్టుకుని పక్క గదికిపోయి తలుపు గడియపెట్టేశాడు. అతను లోటాను పళ్ళెం మీదినుంచి పైకెత్తగానే లోటాలో నుంచి నీరు తిరిగి పళ్ళెంలో పడింది. లోటాలో నుంచి కొద్దిగా పొగలాటిది కూడా వచ్చింది. తరవాత అతను లోటా లోపల అమర్చిన చిన్న కొవ్వొత్తిని తీసేసి, మైనం మరకలన్నీ శుభ్రంగా తుడిచాడు.

అతను చేసిన దేమంటే లోటా దిగువ భాగంలో ఒక చిన్న కొవ్వొత్తిని అంటించి, దాన్ని వెలిగించి పట్టుకువచ్చి, నీళ్ళపళ్ళెం మీద బోర్లించాడు. కొవ్వొత్తి మండుతూండటం వల్ల లోటాలోని గాలి పల్చబడి, దాని పీడన శక్తి తగ్గిపోయింది. లోటాను నీటి మీద బోర్లించగానే పళ్ళెంలోని నీరు పెద్ద చప్పుడుతో లోటాలోకి ఎక్కింది. సోమనాధుడు ఇంద్రజాల విద్యలో సిద్ధహస్తుడు కావటం చేత చూసేవారికి ఎలాటి అనుమానమూ కలగకుండా ఇదంతా చేశాడు.

సోమనాధుడి ఎత్తు పూర్తిగా పారింది. గ్రామస్థులు చాలా సంతోషించారు. అతని రహస్యం ఎరిగినవాళ్ళు దాన్ని భద్రంగా దాచారు. రామనా పూర్తిగా మారిపోయాడు.



# మనిషి విలువ

తంజావూరులో రామసుబ్బుడు అని ఒక ధనవంతు డుండేవాడు. తాను గొప్ప దైవ భక్తుడూ, ధర్మనిరతుడూ అని లోకం అనుకునేటట్టుగా ప్రవర్తించే వాడు, కాని దాన ధర్మాలు చేసేవాడు కాడు.

ఒకనాడు రామసుబ్బుడు చేతులూ, కాళ్ళూ, ముఖమూ కడుక్కోవటానికి దేవాలయం దగ్గిర కొలనులోకి దిగి, మెట్ల మీద కాలుజారి కొలనులో పడిపోయాడు. అతనికి ఈత రాదు. జనం మూగారుగాని అతన్ని కాపాడటానికి ఎవరూ సాహసించ లేదు.

మంటపం దగ్గిర కూర్చున్న సన్యాసి ఒకడు ఇది గమనించి, కొలనులోకి దూకి, రామసుబ్బుణ్ణి ఒడ్డుకు ఈడ్చుకు వచ్చాడు. రామసుబ్బుడు స్పృహ తెలిశాక, తన ప్రాణాలు కాపాడింది ఆ సన్యాసి అని తెలుసుకున్నాడు. అతను తాను కొలను గట్టున విప్పి పెట్టిన చొక్కా జేబునుంచి డబ్బు సంచీ తీసి, అందులోని నాణాల మధ్యనుంచి ఒక పావలా తీసి సన్యాసికి ఇచ్చాడు.

ఆ సంచీలో సవరనులూ, రూపాయలూ ఉన్నాయన్న సంగతి అక్కడి జనానికి తెలిసి, ఆగ్రహంవచ్చి, రామసుబ్బుణ్ణి మళ్ళా కొలనులో పడెయ్యా జూశారు. కాని సన్యాసి వారిని వారించి, "ఎందుకు కోప్పడతారు? తన విలువ ఎంతో అంతా ఇచ్చాడు. వది లెయ్యండి, పాపం!" అన్నాడు.





# దుర్బుద్ధి

చీనాదేశంలో నలుగురు అన్నదమ్ములుండేవారు. వారిలో పెద్దవాడికి రాజకుమార్తెతోనూ, రెండో వాడికి సేనాపతి కుమార్తెతోనూ, మూడో వాడికి మంత్రి కుమార్తెతోనూ పెళ్ళి నిశ్చయమయింది. నాలుగో వాడికి పెళ్ళి ఆలోచనే లేకపోయింది. పెళ్ళి మాట ఎత్తితే వాడు, "నేను పెళ్ళాడితే ఏ గంధర్వ స్త్రీనో పెళ్ళాడతాను," అనేవాడు. అన్నలు వాణ్ణి చూసి నవ్వేవారు.

మూడు వివాహాలూ రాజభవనంలో ఒకేసారి జరిగాయి. ఆ పెళ్ళిళ్ళ వైభవమూ, ఆర్భాటమూ చూస్తె నాలుగోవాడికి అక్కడ తనకు స్థానం లేదనిపించింది. ఆ జనాన్నీ, కోలాహలాన్నీ భరించలేక, ప్రశాంతంగా ఉండే పొలాల కేసి బయలుదేరాడు.

వాడు ఒక వంతెన వద్దకువచ్చి, పిట్టగోడ మీదుగావంగి కిందపారే నీటిని చాలాసేపు చూసి, కదలటానికి నిటారుగా నిలబడేసరికి వాడికి తన సమీపంలో ఒక అపూర్వ సుందరి కనిపించింది. అంత అందగత్తెలు స్వర్గంలో కూడా ఉండరనీ, ఆమె తప్పక దేవతాస్త్రీ అయి ఉంటుందనీ వాడు అనుకున్నాడు. ఆమె ముతక బట్టలు కట్టుకుని ఉన్నప్పటికీ వాడు సంకోచించకుండా, "నన్ను పెళ్ళాడతావా?" అని ఆమెను అడిగాడు.

ఆమె సరేననే సరికి వాడికి పట్టరాని ఆనందం కలిగింది. ఆమె ఎంత దూరమైనా నడపగల పల్లెటూరి మనిషిలాగా ఉన్నప్పటికీ, ఆమెను మేనాలో తీసుకు పోదలచి, వాడు ఆమెను అక్కడే ఉండమని, రాజభవనానికి పరిగెత్తుకుపోయి, "నాకు భార్య దొరికింది," అని కేకలు పెట్టాడు. అయితే ఆ సందడిలో వాడి మాటలు వినిపించుకున్న వారులేరు. వాడు ఎలాగో నలుగురు బోయీలనూ, మేనానూ సంపాదించి,

చీనా జానపద కథ



వంతెన వద్దకు తిరిగివచ్చి, అక్కడే వేచి ఉన్న ఆ మనిషిని మేనాలో ఎక్కించి, రాజ భవనానికి తెచ్చి, "మా అన్నలతో బాటు నా పెళ్ళికూడా చెయ్యండి." అన్నాడు.

పెళ్ళి అయిన మర్నాడు పెళ్ళికూతుళ్ళు తమ తల్లిదండ్రులను చూడబోవటం ఆచారం. అందుచేత పెద్దవాళ్ళ ముగ్గురి భార్యలూ రాజభవనానికి వెళ్ళారు. నాలుగో వాడి భార్యకు తల్లి దండ్రులున్నట్టు కనిపించ లేదు; ఆమెకూడా రాజభవనానికే వెళ్ళింది. పెద్దవాళ్ళ భార్యలు ముగ్గురూ తమ తల్లిదండ్రులకు బహుమానా లిచ్చారు.

కొన్నాళ్ళకు సంవత్సరాది వచ్చింది. పెద్దవాళ్ళు ముగురూ తమ భార్యలతో బహుమానాలను గురించి సంప్రతిస్తున్నారు. నాలుగోవాడు విచారంగా కూర్చున్నాడు. భార్య ఎందుకు అలా ఉన్నావని అడిగితే వాడు, "ఎలా ఉండను? నేను పేదవాణ్ణి, అపూర్వమైన బహుమానాలేమి ఇయ్యగలను?" అన్నాడు.

"నువు సముద్ర తీరానికి వెళ్ళి, అక్కడ నీటిలో తేలి ఉండే పెట్టెను తీసుకురా!" అన్నది నాలుగోవాడి భార్య.

నాలుగోవాడు సముద్ర తీరానికి వెళ్ళి, నీటిలో తేలుతున్న పెట్టెను చూశాడు. అది చాలా పాతది. దాన్ని చూస్తే వాడికి రోత పుట్టింది, కాని భార్య తెమ్మన్నదని ఇంటికి తెచ్చాడు.

నాలుగోవాడి భార్య పెట్టె మూత తెరిచింది. నాలుగోవాడు దానిలోకి తొంగిచూసి ఆశ్చర్యంతో కేక పెట్టాడు. ఆ పెట్టెలో వాడికి మరొక ప్రపంచం కనిపించింది. అక్కడ ఒక మహానగరం ఉన్నది; పెద్ద పెద్ద వీధులూ, గొప్ప గొప్ప ఇళ్ళూ, నాటక శాలలూ, వస్తు సమృద్ధి గల దుకాణాలూ, ఎన్నడూ చూసి ఎరగని జంతువులూ ఉన్నాయి. భార్యా భర్త లిద్దరూ ఆ నగరంలోకి వెళ్ళి, నగరమంతా తిరిగి, పైకి వచ్చినాక నాలుగోవాడి భార్య పెట్టె మూసింది. నాలుగోవాడు ఈ అనుభవంతో దిమ్మెరపోయాడు.

అతను ఈ వింత చూడటానికి తన ముగ్గురు అన్నలనూ, వారి భార్యలనూ ఆహ్వానించాడు. అందరూ కలిసి పెట్టెలో ఉన్న నగరంలోకి వెళ్ళి, వినోదాలన్నీ చూసి, అక్కడే భోజనాలు చేసి, ఆ సాయంకాలం ఎంతో ఉల్లాసంగా గడిపారు. తెల్లవార వస్తూండగా గాని వారికి కాలం ఎలా గడిచినదీ తెలియలేదు.

ఇంత ఆనందమూ పొందిన నాలుగోవాడి వదినెలు నాలుగోవాడి భార్యపట్ల పట్టరాని ద్వేషం కలిగి, తాము చూసినదంతా తమ తండ్రులకు కోపంతోనూ, అసూయతోనూ చెప్పారు. ముగ్గురు అన్నలూ మాత్రం ఆ నగరానికి మరొకసారి పోదామని ఉబలాట పడ్డారు. అయితే రాజు వారిని వద్దని, తానే ఆ నగరాన్ని చూడ నిశ్చయించాడు. ఇంత గొప్ప వింత మామూలు మనుషుల వద్ద ఉండరాదనుకున్నాడు.

"ఈ పెట్టె యుద్ధ సమయంలో నాకు ఎంతయినా పనికి వస్తుంది. ఆ మాయ నగరంలో ఉండే రాజుకు సేన ఉండే ఉంటుంది. యుద్ధాలలో జయించటానికి నేను ఆ సేనను అరువు తీసుకోవచ్చు," అనుకున్నాడు సేనాపతి.

"అలాటి నగరంలో ధనికులు అనేక మంది ఉంటారు. రాజు తరఫున నేను వారిపై పన్నులు వేసి, వసూలు చేసి,



అందులో కొంత సొంతానికి ఉంచుకోవచ్చు," అనుకున్నాడు మంత్రి.

వాళ్ళు ముగ్గురూ ఆ పెట్టె నుంచి ఎలా లాభం పొందాలో నిర్ణయించుకుని, దాన్ని చూడ వచ్చారు. ముగ్గురూ పథకాలు వేసుకున్నారు, కాని ముగ్గురి పథకాలలోకీ చాలా సూటి అయినది - రాజు పథకం. రాజును మించిన వైభోగం గలవాళ్ళు దండనార్హులు; అందుచేత తాను నాలుగోవాణ్ణీ, వాడి భార్యనూ రాజద్రోహ నేరానికి తలలు తీయించ వచ్చు. సేనాపతి తన సేనను పంపకం చేసి నాలుగోవాణ్ణీ, వాడి భార్యనూ హత్యచేయింతామనుకున్నాడు. వాళ్ళ మీద ఏదో ఒక నేరం ప్రచారం చేస్తే,

వాళ్ళను దేశబహిష్కారం చేసి, తిరిగి రాకుండా దూరదేశానికి పంపవచ్చునని మంత్రి అనుకున్నాడు.

వారు ముగ్గురూ పెట్టెలోని నగరంలోకి ప్రవేశించేటప్పుడు నాలుగోవాడూ, వాడి భార్యా కూడా వెంట వెళ్ళారు. రాజు తిన్నగా రాజభవనానికి దారితీశాడు. చిత్రమేమంటే, ఆ నగరానికి రాజు లేడు, కాని సేవకులూ, సైనికులూ చాలామంది ఉన్నారు. రాజు సభాభవనంలో కూర్చుని సారా తెమ్మన్నాడు. సారా వచ్చింది. రాజు తాగటం ప్రారంభించాడు. మిగిలినవాళ్ళు ఆయన అనుమతి లేకుండా కూర్చోవటానికి గాని, సారా తాగటానికి గాని లేదు.

రాజు తాగుతూ ఇలా ఆలోచించాడు; "ఈ పిరికి సేనాపతీ, విశ్వాస ఘాతకుడైన మంత్రీ ఈ అద్భుతమైన పెట్టెను కాజెయ్యటానికి ఆలోచిస్తూనే ఉంటారు. వారి పథకాలు పారితే నన్ను నాశనం చెయ్యరా?'

ఈ ఆలోచనతో రాజు ఆగ్రహం క్షణక్షణానికీ పెరిగిపోయింది. ఆయన ఆకస్మాత్తుగా సైనిక సర్దారును కేకపెట్టి, రెక్కతృటిలో తన సేనాపతిన్నీ, మంత్రినీ శిరశ్ఛేదం చేయించాడు. ఇక ఆయన వెంట నాలుగోవాడూ, భార్యా మాత్రమే మిగిలారు. రాజు సారా తాగుతూ వారికేసి మిర్రి మిర్రి చూడసాగాడు.

ఇంతలో ఆ భవనంలోకి నీరు రాసాగింది. అది నాలుగోవాడికీ, వాడి భార్యకూ మడమల దాకా వచ్చింది, కాని రాజు నీటిని గమనించినట్టు లేదు. నాలుగోవాణ్ణి వాడి భార్య చెయ్యి పట్టుకు గుంజింది. ఇద్దరూ ఆ భవనం నుంచి బయటపడ్డారు. వారు వీధులలోకి వచ్చేసరికి వరద మోకాలిబంటి అయింది. వాళ్ళు పెట్టె నుంచి బయటికి వచ్చేసరికి నడుములోతు నీరున్నది.

నాలుగోవాడి భార్య తన భర్తతో, "ఈ పెట్టె తడిసిపోయింది చూడు. దీన్ని బయట పారెయ్యి." అన్నది.

ఆ తరవాత రాజును చూసినవారు లేరు. ఆయన ఆ మాయనగరపు వరదలో చచ్చిపోయి ఉండాలి!



# బేరంలో సారం

ఒక గ్రామంలో ఇద్దరు రైతు స్నేహితులున్నారు. అందులో ఒకరి వద్ద మేలు జాతి గుర్రం ఉన్నది. ఆ ఇద్దరికీ వ్యాపారం చెయ్యాలని చెడ్డ సరదా. ఒకనాడు గుర్రం గల వాడు తన మిత్రుడితో, "నా గుర్రం ఎంత ధరచేస్తుందంటావు?" అన్నాడు.

"నూరు రూపాయలు," అన్నాడు రెండోవాడు. తన గుర్రం ఇంకా హెచ్చు ధర చేస్తుందని అనుమానం వచ్చి మొదటివాడు రెండోవాడి దగ్గిర నూటయాభై రూపాయలకు తిరిగి కొనుక్కున్నాడు. ఆ తరవాత రెండోవాడు రెండు వందలకు ఆ గుర్రాన్ని మొదటి వాడి నుంచి కొన్నాడు. ఇలా ధర పెరుగుతూ గుర్రం ఆ ఇద్దరి మధ్యా చేతులుమారి దాని వెల పన్నెండు వందలదాకా పెరిగింది. ఇంతలో పట్నం నుంచి ఒక బేరగాడు వచ్చి, ఆ గుర్రాన్ని పదమూడు వందలకు కొనుక్కుపోయాడు.

తీరా వాడు గుర్రాన్ని పట్టుకుపోయాక రైతు లిద్దరూ బాధపడ్డారు. ఆ గుర్రం ఉన్నంత కాలమూ వాళ్ళ వ్యాపారం నిరాఘాటంగా సాగింది. అది పోవటంతో వాళ్ళ వ్యాపారం కాస్తా పోయింది.

—యస్. రాధాకిషన్





# పదకుశలుడు

పూర్వం ఒక యక్షిణి కుబేరుడి వద్ద మూడు సంవత్సరాలు సేవచేసి, ఆయన అనుమతితో ఒక అరణ్య ప్రాంతంలో కొంతమేర సమస్త హక్కులూ పొంది, ఒక గుహలో జీవిస్తూ, తన పొలిమేరలోకి వచ్చిన మనుష్యులను పట్టుకుని తింటూ ఉండేది. ఆమె ఉన్న ప్రాంతంలో తూర్పు పడమరలుగా ప్రయాణీకులు పోయే మార్గం ఉండటంచేత ఆమెకు సుఖంగా గడుస్తున్నది.

ఇలా ఉండగా ఒకసారి, గొప్ప ధనికుడూ, మంచి అందగాడూ అయిన బ్రాహ్మణు డొకడు గొప్ప పరివారంతో సహా ప్రయాణం చేస్తూ అటుగా వచ్చాడు. వాళ్ళను చూడగానే యక్షిణి పెడబొబ్బ పెట్టింది. బ్రాహ్మణుడి వెంట ఉన్నవారు కాలిసత్తువ కొద్దీ పారిపోయారు. బ్రాహ్మణుడు మాత్రం యక్షిణికి దొరికిపోయాడు. ఆమె అతన్ని తన వీపుమీద మోసుకుని తన గుహకు వచ్చింది.

అయితే అతని స్పర్శవల్ల యక్షిణికి అతని మీద మోహం కలిగింది. అందుచేత ఆమె అతన్ని తినక, భర్తగా తనవద్ద ఉంచుకున్నది. ఇద్దరూ ఆ గుహలో కాపరం చేశారు. యక్షిణి రోజూ మనుషులను పట్టుకుని తాను తిని, తన భర్తకు మాత్రం మనుషులు తమ వెంట తెచ్చుకున్న బట్టలూ, బియ్యమూ, నూనే మొదలైనవి ఇచ్చేది. తాను బయటికి పోయినప్పుడు భర్త పారిపోకుండా గుహ ద్వారానికి పెద్ద బండను అడ్డంపెట్టి పోయేది.

ఇలా ఉండగా యక్షిణికి బ్రాహ్మణుడి వల్ల ఒక కొడుకు కలిగాడు. యక్షిణి తన భర్తనూ, కొడుకునూ కూడా అతి ప్రేమగా చూసుకునేది; తాను బయటికి పోయేటప్పుడు మాత్రం ఆ ఇద్దరినీ గుహలో

ఉంచి, రాయి అడ్డంపెట్టి పోయేది. కొడుకు కొంత కాలానికి పెరిగి పెద్దవాడు అయాడు.

ఒకనాడు యక్షిణి బయటికి పోయి నప్పుడు కొడుకు గుహకు అడ్డంగా ఉన్న రాయి తొలగించి, తండ్రిని బయటికి తీసుకు పోయాడు. యక్షిణి వచ్చి, రాయి తొలగించిన దెవరని అడిగితే కొడుకు, "అమ్మా, నేనే తొలగించాను. గుహలో చీకటిగా ఉన్నది." అన్నాడు. కొడుకు మీది ప్రేమచేత ఆమె ఏమీ అనలేదు.

మరొకనాడు కొడుకు తండ్రిని, "నాన్నా, అమ్మకూ, నీకూ ఏమీ పోలికలేదు ఎందు చేత?" అని అడిగాడు.

"నాయనా, నీ తల్లి మనుషులను చంపి తినే యక్షిణి. నువ్వూ, నేనూ మనుషులం," అన్నాడు తండ్రి.

"మనం ఇక్కడ దేనికి? మనుష లుండే చోటికే పోదాం," అన్నాడు కొడుకు.

"మనం పారిపోతే మీ అమ్మ మన ఇద్దరినీ చంపేస్తుంది," అన్నాడు తండ్రి.

తండ్రిని మనుషుల మధ్యకు తీసుకు పోయే బాధ్యత తన మీద వేసుకుని, భయ పడ వద్దని ఆయనకు చెప్పి, తండ్రితో సహా గుహ నుంచి పారిపోసాగాడు కొడుకు.

యక్షిణికి వాళ్ళు దొరికిపోయారు. ఆమె తన భర్తను, "ఎందుకు పారిపోతున్నావు? నీకేంతక్కువ అయింది?" అని అడిగింది.



"నా మీద కోపంవద్దు. నీ కొడుకే నన్ను వెంటతీసుకుని బయలుదేరాడు," అన్నాడు బ్రాహ్మణుడు.

యక్షిణి కొడుకును ఏమీ అనలేక, ఇద్దరినీ ఇంటికి తీసుకుపోయింది.

కొడుక్కు తన తల్లి పొలిమేర ఎక్కడో తెలుసుకోవాలనీ, అది దాటిపోతే ఆమె ఏమీ చెయ్యలేదనీ ఆలోచన వచ్చింది. ఆ మీదట అతను తల్లితో, "అమ్మా, నీ ఆస్తికి నేనే గదా వారసుణ్ణి? నీ అధీనంలో ఉన్న ప్రాంతానికి హద్దులేవో చెప్పు," అన్నాడు.

ఆమె అతనికి నాలుగు దిక్కులా కొండలూ, ఇతర గుర్తులూ చూపి, "మూడు యోజనాల వెడల్పూ, అయిదు యోజనాల




పొడుగూగల ఈ ప్రదేశం నీదేరా," అని చెప్పింది.

రెండు, మూడు రోజులు పోనిచ్చి, కొడుకు తన తల్లి బయటికి వెళ్ళి ఉన్న సమయంలో, తన తండ్రిని భుజాలమీద ఎక్కించుకుని, ఆమె చూపిన సరిహద్దు దాటి, ఒక నదిని చేరుకున్నాడు.

ఆ సమయానికి యక్షిణి అక్కడికివచ్చి, వాళ్ళు తన పొలిమేర దాటినట్టు గ్రహించి, "నాయనా, నీ తండ్రిని తీసుకుని వచ్చెయ్యి. నేను మీకు ఏం లోపం చేశానురా?" అని బతిమాలింది.

ఈ లోపుగా బ్రాహ్మణుడు ఏరు దాటి అవతలికి వెళ్ళాడు.

కొడుకు యక్షిణితో, "అమ్మా, మేము మనుషులం. నువు యక్షిణివి. నీ దగ్గిర మేం ఎంతకాలం ఉంటాం?" అన్నాడు.

యక్షిణి అతనితో, "నాయనా, ఇక నువు తిరిగి రానేరావా? చదువురానివాడు మనుషుల మధ్య బతకటం కష్టం. నీకు చింతామణి అనే విద్య ఒస్తాను. దాని ప్రభావంతో పన్నెండేళ్ళనాటి అడుగుజాడలు కూడా తెలుస్తాయి. దానితో సుఖంగా బతుకు నాయనా!" అన్నది.

కొడుకు నదీ తీరానే ఉండి తల్లికి మొక్కి, మంత్రం నేర్చుకున్నాడు. ఒక చెంప పుత్రవాత్సల్యంతో ఏడుస్తూనే యక్షిణి తన కొడుక్కు మంత్రం చెప్పింది. మంత్రం గ్రహించి కొడుకు తల్లికి మళ్ళీ నమస్కారం చేసి, "అమ్మా, ఇక వెళ్ళు," అన్నాడు.

"నువు తిరిగి రాకపోతే నా ప్రాణాలు పోతాయి, నాయనా," అంటూ యక్షిణి గుండెలు బాదుకుని, అక్కడే చచ్చి పడిపోయింది.

కొడుకు తల్లి చచ్చిపోయినందుకు దుఃఖించి, ఆమెను పూలతో పూజించి, చితి పేర్చి దహనం చేసి, తండ్రిని వెంటబెట్టుకుని వారాణసి చేరి, "పదకుశలుడు" వచ్చాడని రాజుకు కబురు చేశాడు.

రాజు అతన్ని లోపలికి రప్పించాడు. అతను రాజుకు నమస్కరించాడు. రాజు

అతన్ని, "నీకే విద్యలు తెలుసు?" అని అడిగాడు.

"దేవా, పన్నెండేళ్ళనాటి అడుగు జాడలను బట్టి కూడా పోయిన వస్తువులను తీసుకు రాగలను," అన్నాడు పదకుశలుడు.

రాజు అతన్ని రోజుకు వెయ్యి నాణాల జీతం మీద తన కొలువులో ఉంచుకున్నాడు.

ఒకనాడు రాజపురోహితుడు రాజుతో, "మహారాజా, ఈ పదకుశలుడు జీతం పుచ్చుకుంటున్నాడే గాని, తన విద్య చూపిన పాపాన పోలేదు," అన్నాడు.

రాజు పదకుశలుణ్ణి పరీక్షించాలనుకుని, తన రత్నాలను రక్షించే ఇద్దరు భటులను పిలిచి, వాళ్ళకు చెప్పవలిసినది చెప్పాడు. వాళ్ళు రత్నాలను తీసుకుని రాజప్రాసాదం దిగి, రాజ భవనం చుట్టూ, మూడుసార్లు తిరిగి, నిచ్చెన మీద ప్రాకారం ఎక్కి బయటికి దిగి, అక్కడ ఒక చావడిలో కాస్సేపు కూర్చుని, తిరిగి నిచ్చెన సహాయంతో ప్రాకారం ఎక్కి, లోపలికి దిగి, ఒక కోనేరు చేరి, దానిచుట్టూ మూడు సార్లు తిరిగి, రత్నాలను ఆ కోనేటిలో దాచి, మళ్ళీ ప్రాసాదం ఎక్కారు.

మర్నాడు రాజభవనంలో రత్నాలు పోయినట్టు పుకారు పుట్టింది. రాజు పదకుశలుణ్ణి పిలిపించి, "రాజ భవనంలో రత్నాల చౌర్యం జరిగింది. వాటి జాడ చూసి చెప్పు," అన్నాడు.

"పన్నెండేళ్ళ క్రితం పోయిన వస్తువులనే తేగలను. నిన్న పోయిన వాటిని



తేవటం ఎంత ?" అన్నాడు పదకుశలుడు. అతను తన తల్లిని స్మరించుకుని, ఆమె చెప్పిన మంత్రం జపించి, "మహారాజా, ఇద్దరు దొంగల అడుగుజాడలు కనిపిస్తు న్నాయి," అన్నాడు.

అతను రాజుగారి అడుగుజాడలూ, రాజ పురోహితుడి అడుగుజాడలూ పట్టుకుని రత్నాలుండే చోటికి వెళ్ళాడు. అక్కడి నుంచి అతను రాజభవనం చుట్టూ మూడు సార్లు తిరిగి, ప్రాకారం చేరి, "మహారాజా, అడుగుజాడలు ఆకాశంలో కనిపిస్తున్నాయి. నిచ్చెన తెప్పించండి," అన్నాడు. తరవాత అతను నిచ్చెన మీద ప్రాకారం ఎక్కి, బయటికి దిగి, చావడి వద్దకు వెళ్ళి, మళ్ళీ ప్రాకారం ఎక్కి దిగి, కోనేరు వద్దకు వచ్చి, దాని చుట్టూ మూడుసార్లు తిరిగి, "మహారాజా, దొంగలు ఈ కోనే టిలో దిగారు," అంటూ తాను కూడా దిగి, రత్నాలు పైకి తీసి, "మహారాజా, దొంగలు చాలా గట్టివాళ్ళు; ఈ మార్గాన రాజభవనం ఎక్కారు," అన్నాడు.

"ఈ మనిషి పోయిన వస్తువులను తీసుకు రాగలడుగాని దొంగలను పట్టలేడులాగుంది," అనుకుని రాజు పదకుశలుడితో, దొంగలను కనుక్కోలేవా ?" అన్నాడు.

"దొంగలు ఇక్కడే ఉన్నారు. పోయిన వస్తువులు దొరికినాక దొంగల ప్రసక్తి దేనికి ?" అన్నాడు పదకుశలుడు.

"దొంగ లెవరో చెప్పకపోతే నువే దొంగ తనం చేశావు అనుకోవలసి వస్తుంది," అన్నాడు రాజు.

"అలా అయితే రేపు సభలో దొంగలు ఎవరో చెబుతాను," అన్నాడు పదకుశలుడు.

రాజు మర్నాడు సభలో పదకుశలుణ్ణి, "రత్నాలు దొంగిలించిన వాళ్ళు ఎవరు ?" అని అడిగాడు.

"మీరూ, మీ పురోహితుడూనూ," అన్నాడు పదకుశలుడు.

సభలో వాళ్ళు ఈ మాటవిని దిగ్భ్రమ చెందారు. కాని రాజు పదకుశలుణ్ణి మెచ్చు కుని, తాను అతనికి పెట్టిన పరీక్ష వివరించి సభికులకు చెప్పాడు.






యుద్ధం రెండో రోజు, మధ్యాన్నం దాటి నాక, కౌరవ యోధులైన అశ్వత్థామా, కృపుడూ, శల్యుడూ పాండవ యోధులైన ధృష్టద్యుమ్న, అభిమన్యులతో యుద్ధం చేశారు. తరవాత, దుర్యోధనుడి కొడుకైన లక్ష్మణుడికీ, అభిమన్యుడికీ మధ్య తీవ్ర మైన ద్వంద్వయుద్ధం జరిగింది. అందులో లక్ష్మణుడు ఓడిపోతూ ఉండటం చూసి దుర్యోధనుడూ, ఇంకా అనేక మంది కౌరవయోధులూ వెళ్ళి అభిమన్యుణ్ణి చుట్టుముట్టారు.

అభిమన్యుడు నిర్భయంగా అందరితోనూ పోరుతూ ఉండగా, అతనికి అండగా అర్జునుడు వచ్చాడు. అది చూసి భీష్మద్రోణులు మొదలైన మహారథులు అటునుంచి వచ్చారు. అర్జునుణ్ణి ఆ సమయంలో ఎదుర్కోవటం ఎవరి వల్లా కాలేదు. అతను ప్రళయకాల రుద్రుడిలాగా కౌరవసేనలను చించి చెండాడుతుంటే, చచ్చినవారు చావగా, మిగిలినవారు పారిపోసాగారు.

భీష్ముడు ద్రోణుడితో, "అర్జునుడు ఇలా యుద్ధం చేసేటప్పుడు అతని ముందు ఎవరూ నిలవలేరు. పారిపోయే మన సైన్యాన్ని వెనక్కు తిప్పటం సాధ్యంకాదు. అదీగాక సూర్యుడు అస్తమించబోతున్నాడు. ఇవాళకు యుద్ధం ముగించటం మేలని పిస్తుంది." అన్నాడు.

మూడో రోజు ఉదయం కౌరవసేనలు గరుడవ్యూహంలోనూ, పాండవ సేనలు అర్ధ చంద్రవ్యూహంలోనూ యుద్ధానికి సిద్ధ



మయాయి. యుద్ధం ఆరంభ మవుతూనే దుర్యోధనుడు రథబలాలను వెంట బెట్టుకుని ఘటోత్కచుణ్ణి ఎదుర్కొన్నాడు. పాండవులు భీష్మ ద్రోణులను ఎదుర్కొన్నారు. అభిమన్యుడూ, సాత్యకీ శకునిని ఎదుర్కొన్నారు. అర్జునుడు రథ యోధులను విపరీతంగా వధచెయ్య సాగాడు. అదే విధంగా భీష్మ ద్రోణులు పాండవ సేనలను నిర్మూలించ సాగారు. అయితే భీముడూ, ఘటోత్కచుడూ కలిసి కౌరవ సేనను తరమసాగారు. ఆ సేనను మళ్ళించటం భీష్మ ద్రోణుల తరం కాలేదు. ఆ పని దుర్యోధనుడు చెయ్యగలిగాడు. దుర్యోధనుడి సేనలు మరలటం చూసి, పారిపోయే ఇతర సేనలు సిగ్గుపడి తాముకూడా మరలి యుద్ధానికి వచ్చాయి.

దుర్యోధనుడు భీష్ముడి వద్దకు వచ్చి నిష్ఠురంగా, "తాతా, నువు యుద్ధరంగంలో ఉండగానే మన సేనలు చెదరి పారిపోవటం నీ కెంత అవమానం? నీకు పాండవుల పట్ల అంత దయ ఉన్నట్టయితే, యుద్ధానికి ముందే, 'నేను పాండవులతోనూ, సాత్యకి తోనూ, ధృష్టద్యుమ్నుడితోనూ యుద్ధం చెయ్యను,' అని చెప్పి ఉండవలిసింది. మీ రందరూ మీ పరాక్రమాలకు తగినట్టుగా యుద్ధం చెయ్యకపోతే నేనేమయిపోతాను?" అన్నాడు.

భీష్ముడు కోపంతోనే నవ్వుతూ, "ఏమోయ్, నీకు ఎన్నిసార్లు చెప్పాను? పాండవులను జయించటం దేవేంద్రుడికీ, దేవతలకూ కూడా సాధ్యం కాదని నేను నీతో అనలేదా? ముసలివాణ్ణి. నా శక్తికొద్దీ పోరాడుతూనే ఉన్నాను. నేను ఎలా పోరాడేదీ నువ్వూ, నీ వాళ్ళూ చూడండి," అన్నాడు.

పాండవులది యుద్ధంలో పై చెయ్యి అవుతూ ఉండటం చూసి భీష్ముడు మహా భీభత్సమైన యుద్ధానికి పూనుకున్నాడు. దుర్యోధనుడి సేన అంతా ఆయన వెంట ఉన్నది. ఆ పూట భీష్ముడి ఎదటపడి దెబ్బ తిననివాడు లేదు. పాండవ సైన్యం వెయ్యి చీలికలయింది. కృష్ణార్జునులు

చూస్తూ ఉండిపోయారే గాని భీష్ముణ్ణి నిరోధించలేకపోయారు.

బెదిరిన గొర్రెలాగా పారిపోయే సైనికులను చూసి కృష్ణుడు అర్జునుడితో, "అర్జునా, నీ ప్రతాపం ఇప్పుడు చూపించు. ఎదట పడిన కౌరవుల నందరినీ చంపేస్తానని మొదట మాట ఇచ్చావు. భీష్ముణ్ణి చూసి యోధులందరూ మృత్యువును చూసినట్టు బెదిరిపోతున్నారు," అన్నాడు.

"కృష్ణా, రథాన్ని భీష్ముడి కెదురు నడిపించు. ఆ ముసలివాడి అంతు తేల్చుతాను," అన్నాడు అర్జునుడు. కృష్ణుడు అలాగే చేశాడు.

భీష్ముడు ఎదురు కాగానే అర్జునుడు ఆయన చేతి విల్లును తన బాణంతో విరగగొట్టేశాడు. భీష్ముడు అర్జునుణ్ణి మెచ్చుకుంటూ, మరొక విల్లు తీసుకుని, తనతో యుద్ధం చెయ్యమన్నాడు. ఇద్దరూ యుద్ధం చేస్తుంటే కృష్ణుడికి అర్జునుడు పట్టుదలగా యుద్ధం చేస్తున్నట్టు తోచలేదు. "ఈ అర్జునుడు భీష్ముడి పట్ల ఇంత గౌరవం చూపితే ధర్మరాజు సేన నశించటానికి ఎంతో కాలం పట్టదు. నేనే కవచం ధరించి, భీష్ముణ్ణి చంపి, పాండవుల కార్యం నెరవేర్చాలి," అనుకున్నాడతను.

ఈ లోపల అర్జునుడి మీదికి కొన్ని వందల మంది కౌరవ వీరులు వచ్చి, అతన్ని చుట్టు ముట్టారు. ఆ స్థితిలో సాత్యకి అర్జునుడికి అండగా వచ్చాడు. అతను పారిపోయే వారిని నిలవమని హెచ్చ





రించాడు. కృష్ణుడు సాత్యకితో, "సాత్యకీ, పొయ్యేవాళ్ళను పోనీ, మిగిలినవారిని కూడా పారిపోనీ. ఈ భీష్ముణ్ణీ, ద్రోణుణ్ణీ, మిగిలిన కౌరవ యోధులనూ నా చక్రాయుధంతో చంపి, ధర్మరాజుకు పట్టం గట్టుతాను," అన్నాడు.

ఇలా అని కృష్ణుడు తన చక్రాయుధాన్ని భుజాన పెట్టుకుని, పగ్గాలను విడిచిపెట్టి, నేలమీదికి దూకాడు. చక్రం పట్టుకుని తన పైకి వచ్చే కృష్ణుడితో భీష్ముడు శాంతంగా, "రా, నీ చేతిలో చావటం వల్ల నాకు కీర్తీ, గౌరవమూ లభిస్తాయి," అన్నాడు.

కృష్ణుడు భీష్ముడి వద్దకు వచ్చి, "ఈ ప్రజాక్షయానికి మూలకారణం నువే! మాయజూదం ఆడేటప్పుడు దుర్యోధనుణ్ణి నివారించలేకపోయావు గాని, ఇప్పుడు అతణ్ణి రక్షించటానికి బయలుదేరావు! ఆ కులద్రోహి నీ మాట ఒకవేళ విని ఉండకపోతే వాణ్ణి ఎందుకు వదిలిపెట్టావు కావు?" అని అడిగాడు.

"రాజు పరమ దైవం కదా?" అన్నాడు భీష్ముడు.

"యాదవులు కంసుణ్ణి వదిలిపెట్టలేదా? విపరీత బుద్ధి గలవాడు వినాశనం చెందక తప్పుతుందా?" అన్నాడు కృష్ణుడు.

ఇంతలో అర్జునుడు తన రథం నుంచి దిగి వచ్చి, కృష్ణుణ్ణి గట్టిగా పట్టుకున్నాడు. అతను కృష్ణుణ్ణి వేడుకుంటూ, "శాంతించు. పాండవులకు నీ కన్న వేరే గతి ఏది? నేను చేసిన ప్రతిజ్ఞ నిలబెట్టుకుంటాను. కౌరవులనందరినీ యుద్ధంలో చంపుతానని నా బంధుమిత్రుల మీద ఒట్టు పెట్టుకుంటున్నాను," అన్నాడు.

ఆ మాటకు తృప్తిపడి కృష్ణుడు తిరిగి వచ్చి రథం మీద కూర్చుని, పగ్గాలు చేతబట్టి, శంఖం పూరించాడు. వెంటనే అర్జునుడు మహా దారుణమైన యుద్ధం ప్రారంభించాడు. అతనితో భీష్ముడితోబాటు భూరిశ్రవుడూ, శకునీ మొదలైన కౌరవ యోధులు యుద్ధం చేశారు. అర్జునుడి బాణాలు రథాలనూ, ఏనుగులనూ, గుర్రా

లనూ ఛేదించాయి. యోధులు తీవ్రంగా దెబ్బతిన్నారు.

త్వరలోనే విరాటుడూ, ద్రుపదుడూ మొదలైన వారు అర్జునుడికి సహాయం వచ్చారు. యుద్ధరంగమంతా పీనుగుపెంట అయింది. రక్తం ఏర్లుకట్టి పారింది. పాండవులు విజయధ్వానాలు చేశారు. అర్జునుడు ఐంద్రాస్త్రం ప్రయోగించాడు. దానితో భీష్మ, ద్రోణులూ, దుర్యోధనుడూ మొదలైన వారు వెనక్కు తిరిగారు. కౌరవ సేనలు చెల్లాచెదురుగా పారిపోసాగాయి. ఆ రోజు అర్జునుడు కౌరవయోధులకు గొప్ప అపకీర్తి కలిగించాడు. ధర్మరాజు యుద్ధం ముగించి తమ శిబిరానికి వెళ్ళిపోయాడు.

నాలుగో రోజు తెల్లవారగానే కౌరవ సర్వ సేనాధిపతి అయిన భీష్ముడు చాలా కోపంతో యుద్ధానికి సిద్ధమయాడు. ఆయన వెంట ద్రోణ, దుర్యోధన, బాహ్లికులు మొదలైన వీరులు బయలుదేరారు. ఆ రోజు పాండవసేనకు ముందు అర్జునుడు నిలబడ్డాడు.

యుద్ధం ఆరంభమవుతూనే భీష్ముడూ, అర్జునుడూ ఒకరినొకరు ఎదుర్కొన్నారు. ద్రోణుడూ, కృపుడూ, శల్యుడూ, వివింశతి, దుర్యోధనుడూ, మరికొందరు కూడా అర్జునుడి పైకి వచ్చారు. అలా వచ్చిన కౌరవ వీరులను అభిమన్యుడు ఎదుర్కొన్నాడు.



అర్జున, అభిమన్యులకు ధృష్టద్యుమ్నుడు తోడు వచ్చి, అనంతరం జరిగిన యుద్ధంలో సాంయమని అనే యోధుడి కొడుకును చంపాడు.

అప్పుడు ధృష్టద్యుమ్నుడి మీదికి శల్యుడు వచ్చాడు. ఇద్దరూ రెండు గడియల పాటు సమ యుద్ధం చేశారు. ఇంతలో శల్యుడి పైకి అభిమన్యుడు వచ్చిపడ్డాడు. శల్యుణ్ణి రక్షించటానికి వచ్చిన దుర్యోధన, దుశ్శాసన, దుర్మర్షణ, దుస్సహ, దుర్ముఖ, చిత్రసేనాదులు అభిమన్యుణ్ణి చుట్టుముట్టారు. అప్పుడు భీముడూ, ధృష్టద్యుమ్నుడూ, ఉప పాండవులూ, నకుల సహదేవులూ, అభిమన్యుడూ,



వీళ్ళు పదిమందీ దుర్యోధనాదులు పది మందితో యుద్ధం చేశారు.

ఆ యుద్ధంలో భీముడు గద పట్టుకుని శల్యుడి మీదికి బయలుదేరాడు. అది చూసి దుర్యోధనుడు ఏనుగుల సేనను ముందుంచుకుని భీముణ్ణి ఎదుర్కొన్నాడు. భీముడు గర్జిస్తూ, గదతో సహా రథం నుంచి దిగి, ఏనుగులను ఎడాపెడా చంపనారంభించాడు. మిగిలిన తొమ్మిదిమంది పాండవ యోధులూ వెనకనుంచి అతన్ని కాపాడారు. ఆ యుద్ధంలో అనేక ఏనుగులూ, గజ యోధులూ చావటం జరిగింది. ఆ సేన మాగధుడిది. అందుచేత మాగధుడు ఐరావతం లాటి గొప్ప ఏనుగును ఎక్కి, దాన్ని అభిమన్యుడి రథం మీదికి పురిగొల్పాడు. అభిమన్యుడు ఆ ఏనుగునూ, మాగధుణ్ణీ కూడా బాణాలతో కొట్టి చంపేశాడు. ఆ తరవాత భీముడి పీడనకు తట్టుకోలేక అనేక ఏనుగులు వెనక్కు తిరిగి కౌరవ సైనికులనే తొక్కుతూ పారిపోయాయి. భీముణ్ణి చంపటానికి వచ్చిన కౌరవ వీరులకూ, భీముణ్ణి కాపాడుతున్న పాండవ వీరులకూ మధ్య తీవ్రంగా యుద్ధం జరిగింది.

పాండవ వీరులలో విజృంభించి యుద్ధం చేసి అందరినీ పీడించినవాడు సాత్యకి. అతని దెబ్బకు ఎవరూ తట్టుకోలేకుండా ఉన్న స్థితిలో భూరిశ్రవుడు అతనితో యుద్ధానికి తలపడ్డాడు. కాని సాత్యకి ఆయనను పారదోలాడు.

అప్పుడు ఉభయ పక్షాల యోధులకూ జరిగిన యుద్ధంలో భీముడు ప్రముఖంగా పోరాడుతూ ధృతరాష్ట్రుడి కొడుకులను, సుషేణుడూ, జలసంధుడూ, వీరబాహుడూ, భీమరథుడూ, సులోచనుడూ అనేవారిని వరసగా చంపాడు.

భీష్ముడిది చూసి, భీముణ్ణి ముట్టడించమని తన మహారథులను ఆదేశించాడు. వారిలో భగదత్తుడు, నరకాసురుడి కొడుకు, ఒక మదగజాన్ని ఎక్కి, భీముడి పైకి వచ్చాడు. అభిమన్యుడు మొదలైనవాళ్ళు భగదత్తుడి మీదా, అతని ఏనుగు మీదా

బాణవర్షం కురిపించి, బాధించారు. భగదత్తుడు ఆ గాయపడిన ఏనుగును పాండవ సేనలపైకి పురికొల్పాడు. ఇంతేగాక భగదత్తుడు భీముణ్ణి ఒక బాణంతో మూర్ఛపోగొట్టి సింహనాదం చేశాడు.

అది చూసి ఘటోత్కచుడు కోపావేశం చెంది, మరొక మదగజం మీద వచ్చి, భగదత్తుడిపై కలియబడ్డాడు. వాళ్ళ యుద్ధం దారుణంగా పరిణమించింది. అందులో భగదత్తుడు చస్తాడని శంకించి, మహారథుడూ, సేనాపతీ అయిన భగదత్తుణ్ణి కాపాడుకోవటానికి ద్రోణుడూ, దుర్యోధనుడు మొదలైన వారు సహాయం వెళ్ళారు. వెంటనే ఘటోత్కచుడికి సహాయంగా పాండవయోధులు వచ్చారు.

ఘటోత్కచుడి యుద్ధం చూసి భీష్ముడికి అసహ్యం వేసింది. ఆయన ద్రోణుడితో, "ఈ ఘటోత్కచుడు విజృంభించి ఉన్నాడు. వాడికి సహాయం కూడా బలంగా ఉన్నది. మనం అలసి ఉన్నాం. అందుచేత ఇవాళకు యుద్ధం చాలింతాం," అన్నాడు.

ఈ మాట అందరికీ నచ్చింది. అందరూ ఉపాయంగా ఘటోత్కచుడి యుద్ధం నుంచి బయటపడి, యుద్ధరంగం నుంచి వెళ్ళిపోసాగారు. అప్పుడు పాండవులు శంఖాలు పూరించి, సింహనాదాలు చేసి, భీముణ్ణీ, ఘటోత్కచుణ్ణీ పొగడుతూ తమ శిబిరాలకు వెళ్ళిపోయారు. ఎవరి ఇళ్ళకు వారు వెళ్ళిన అనంతరం దుర్యోధనుడు తన తమ్ములు పోయినందుకు కొంతసేపు దుఃఖించి, తరవాత తన శిబిర కృత్యాలు నిర్వర్తించి, ఆలోచనలో పడ్డాడు.

ఈ వార్తలన్నీ సంజయుడు చెప్పగా ధృతరాష్ట్రుడు, "సంజయా, పాండవులను తలుచుకుంటే నాకు భయంగా ఉన్నది. ఏం జరుగుతుందో తెలియటం లేదు. విదురుడు చెప్పినట్టే జరుగుతుందో ఏమో? ఎలాగైనా పాండవులు చచ్చేటందుకూ, నా కొడుకులు బతికేటందుకూ మార్గం ఉంటే చెప్పు. పాండవులు ఏదో వరం పొంది ఉంటారు. దేవుడు నన్ను క్రూరంగా శిక్షిస్తున్నాడు," అన్నాడు.





# మిత్రభేదం

## 4

### దంతిలుడి కథ

సంజీవకానికి దమనకం దంతిలుడి కథ ఇలా చెప్పింది:

వర్ధమాన నగరంలో దంతిలుడు అనే ఒక గొప్ప వర్తకుడుండేవాడు. ఆయన నగరపాలకుడుగా ఉండి, నగరానికి సంబంధించిన విషయాలన్నీ చూసేవాడు. ఆయన రాజుగారి సొంత ఖర్చు వెచ్చాలు కూడా చూసేవాడు. ఆయన అటు రాజుగారినీ, ఇటు ప్రజలనూ కూడా సంతోషపెట్టి, అందరి మన్ననలనూ పొందుతూ వచ్చాడు. రాజుకు హితుడైన వాణ్ణి ప్రజలు ద్వేషిస్తారనీ, ప్రజలకు హితుడైన వాణ్ణి రాజు ద్వేషిస్తాడనీ, రాజ క్షేమానికీ, ప్రజా క్షేమానికీ వైరుధ్యం ఉండటం చేత ఉభయులనూ తృప్తిపరచటం చాలా అరుదనీ చెబుతారు. కాని దంతిలుడు అలాటి అరుదైనమనిషి.

ఒకప్పుడు దంతిలుడు తన కుమార్తె వివాహం జరిపాడు. దానికి ఆయన పౌరులనూ, రాజోద్యోగులనూ ఆహ్వానించి, విందు భోజనాలు పెట్టి, విలువైన బట్టలు పెట్టి పంపేశాడు. వివాహం పూర్తి అయాక ఆయన వధూవరులను ఆశీర్వదించటానికి రాజునూ, ఆయన భార్యలనూ ఆహ్వానించాడు. వారు ఆహ్వానం అందుకున్నారు. ముందుగా దివాణం నుంచి అనేక మంది ఉద్యోగులూ, నౌకర్లూ దంతిలుడి ఇంటికి వచ్చారు. వారిలో రాజుగారి ఇంట కసువు ఊడ్చేవాడు గోరభుడు అనే వాడు కూడా ఉన్నాడు. గోరభుడు మాన మర్యాదలు పాటించక, రాజ పురోహితుడి కొరకు ఏర్పాటు చేసిన ఆసనంలో వెళ్ళి కూర్చుని, లేవ నిరాకరించాడు. అందుచేత దంతిలుడు

అట్ట చివరి బొమ్మ



వాణ్ణి బయటికి గెంటించాడు. తరవాత రాజు తన రాణులతో సహా వచ్చి, దంతిలుడు చేసిన సత్కారాలు పొందాడు.

తనకు జరిగిన అవమానానికి ఉడికిపోతూ గోరభుడు ఆ రాత్రి నిద్రపోలేదు. వాడు ఇలా ఆలోచించాడు: "ఈ అవమానానికి ప్రతిక్రియ ఏమిటి? దంతిలుడిపై రాజుకు ఆగ్రహం తెప్పించి, అవమానం పాలు చెయ్యగలనా? లేక నేను ఏమీ చెయ్యలేక అవమానంతో కృశించి పోవలసినదేనా? పగ తీర్చుకోలేకుండా ఆగ్రహం చెందే వాడు సిగ్గుమాలిన వాడు. పెనం మీద వేసిన ఆవగింజ ఎంత ఎగిరి పడినా పెనాన్ని విరగగొట్టలేదు. నేను కసువు ఊడ్చేవాణ్ణి, ఆయన కోటీశ్వరుడూ, నగర పాలకుడూ; అయినా నన్ను అవమానించి ఆయన తప్పించుకు పోలేడని చూపిస్తాను."

రాజుగారు పక్క వదలక ముందే రాజుగారి శయనాగారం చిమ్మటం గోరభుడి పని. ఇది జరిగిన మర్నాటి ఉదయం రాజుగారు నిద్రలేచి, ఇంకా పక్కమీదనే ఉండగా, గోరభుడు గది చిమ్ముతూ, "దంతిలుడు పెద్ద రాణీగారిని ఆలింగనం చేసుకోవటం ఎంత సాహసం!" అని గొణుక్కున్నాడు.

ఈ మాటలు విని రాజు చివాలున లేచి," ఒరే, నువు ఇప్పుడు గొణిగినది నిజమా? దంతిలుడు పెద్దరాణిని కౌగలించుకున్నాడా?" అని అడిగాడు.

"దొరా, రాత్రి పొద్దుపోయి పాచికలాడుతూ మేలుకుని ఉండటంచేత, నిద్ర మత్తుతో జోగుతూ ఏమన్నానో నాకే తెలీదు," అన్నాడు గోరభుడు.

రాజు తనలో, "రాణులుండే గదులలోకి వెళ్ళే పర పురుషులు దంతిలుడూ, ఈ గోరభుడూ మాత్రమే. అందుచేత దంతిలుడు పెద్దరాణిని ఆలింగనం చేసుకోవటం ఈ గోరభుడి కంటపడి ఉండవచ్చు. నిన్న సాయంకాలం దంతిలుడు పెద్ద రాణి పట్ల, మిగిలిన రాణుల పట్లకన్న, హెచ్చు శ్రద్ధ చూపటమూ, ఆవిడ

అతనితో కొంచెం హెచ్చు చనువుగా ఉంద టమూ గమనించి అదంతా లాంఛన మను కున్నాను. కాని వీడు అనే మాటలన్ను బట్టి అందులో విశేషార్థం కనిపిస్తున్నది. తాగు బోతుల నోటా, నిద్రపోయేవారి నోటా రహస్యాలు బయట పడతాయి. అనేక మంది భార్యలు ఉండటం చేత నేను పెద్ద రాణి పట్ల నిర్లక్ష్యంగా ఉంటున్న మాట నిజమే. అందుచేత ఆమె దంతిలుడి ప్రేమ కోసం ఆశపడి ఉండవచ్చు. నాకు ఎంత కష్టం వచ్చింది!" అనుకుని, దంతి లుణ్ణి రాజభవనంలో అడుగుపెట్ట నివ్వ వద్దని ద్వారపాలకులకు ఉత్తరువిచ్చాడు.



ఆ ఉదయం దంతిలుడు ఎప్పటిలాగే రాజభవనానికి వచ్చి, ద్వారపాలకులు తనను లోనికి పోనివ్వక పోవటం చూసి ఆశ్చర్యపడి, "నన్ను లోపలికి పోవద్దన టానికి మీకెన్ని గుండెలు!" అన్నాడు.

"అయ్యా, మా పైన కోప్పడకండి. ఇది రాజుగారి ఉత్తరువు," అన్నారు వాళ్ళు.

"రాజుగారి ఉత్తరువా? ఆయన అలాటి ఉత్తరువు ఒక్కనాటికీ ఇయ్యడు," అన్నాడు దంతిలుడు.

"సరేలెండి. రాజుగారికి మీమీద ఎందుకో చాలా కోపం వచ్చి ఉండాలి. ఆయన ఉత్తరువు ఇచ్చారు. దాన్ని పాలించటం మా విధాయకం," అన్నారు ద్వారపాలకులు.

రాజుగారికి తనపై గలిగిన అకారణ క్రోధానికి దంతిలుడు నిర్ఘాంతపోయి తనలో ఇలా అనుకున్నాడు: "డబ్బు రావటంతో గర్వించనివాడూ, భోగలాలసత వల్ల ఏదో ఒక చిక్కు రానివాడూ, రాజుగారి ప్రేమకు నిజంగా పాత్రుడైనవాడూ, చావును తప్పించు కున్నవాడూ, గౌరవం పొందిన యాచకుడూ ఉండడని పెద్దలు చెబుతారు. కాకిలో శౌచమూ, జూదరిలో నిజమూ, తాగు బోతులో వేదాంతమూ ఎవరు చూశారు? నేను రాజుకు గాని, రాజ బంధువులకు గాని కలలో కూడా ఎలాంటి అన్యాయమూ చేసి ఎరగనే, రాజుకు నా పై ఆగ్రహం ఏల కలిగింది?"

దంతిలుడు నిస్సహాయుడై నిలబడి ఉండటం చూసి గోరభుడు ద్వారపాలకులతో, "నన్ను ఈయనగారు బయటికి గెంటేసినట్టే మీరు ఈయనగారిని బయటికి గెంటండి," అన్నాడు.

ఇది విని దంతిలుడు, ఈ గోరభుడే దీనికంతకూ కారకుడని గ్రహించి, ఆ రాత్రి గోరభుణ్ణి తన ఇంటికి పిలిచి, వాడికి మేలైన బట్టలు పెట్టి, "నాయనా, నేను నిన్ను పొగరెక్కి అవమానించలేదు. రాజపురోహితుడి ఆసనం మీద కూర్చుని, దిగమంటే దిగక, చేజేతులా అవమానం తెచ్చిపెట్టుకున్నావు," అన్నాడు.

గోరభుడు తనకు పెట్టిన బట్టలు చూసి మహదానందం చెంది, "ఆ అవమానం అప్పుడే పోయిందిలెండి. రాజుగారికి మీమీద అనుగ్రహం కలిగేటట్టు ఎలా చేస్తానో చూడండి," అని వెళ్ళిపోయాడు.

మర్నాడు ఉదయం రాజుగారు పక్కమీద మేలుకుని పడుకుని ఉండగా గోరభుడు గది చిమ్ముతూ, "రాజుగారికి ఇంగితజ్ఞానం లేదేం? దొడ్డికి వెళ్ళి దోసకాయలు తింటాడు!" అని గొణిగాడు.

రాజుగారు ఆ మాట విని, గోరభుణ్ణి దగ్గిరికి పిలిచి, "ఎందుకురా అబద్ధాలాడుతున్నావు? మరొకడైతే చంపేసి ఉందును. నేను దొడ్డికి పోయి దోసకాయలు తినగా నువు చూశావురా?" అని అడిగాడు.

"దొరా, రాత్రి చాలా పొద్దుపోయినదాకా పాచికలాడటం చేత నిద్రమత్తున ఏమన్నానో నాకే తెలీదు. క్షమించండి," అన్నాడు గోరభుడు.

వాడి మాటకు ఏమీ విలువ లేదని రాజుకు తెలిసిపోయింది. దంతిలుడికి తాను చాలా అన్యాయం చేశాడు. అతను చాలా పెద్దమనిషి; తప్పుడు పనులు చెయ్యడు. అదీగాక, దంతిలుణ్ణి ఒకరోజు రానివ్వక పోయేసరికి దివాణం పనులూ, నగరం పనులూ అస్తవ్యస్తమయిపోయాయి. అందుచేత రాజు దంతిలుణ్ణి పిలపనంపి, ఆయనకు మంచి బట్టలూ, కానుకలూ ఇచ్చి, ఎప్పటిలాగే పదవిలో ఉండనిచ్చాడు.



# 142. పపైరస్

మొట్టమొదటగా ఈజిప్షనులు కాగితం తయారు చెయ్యటానికి పపైరస్ అనే ఈ తుంగలాటి నీటి మొక్కల కాడలను ఉపయోగించారు. ఇది **6000** ఏళ్ళ క్రితం మాట. మనం ఇప్పుడు వాడే కాగితం వచ్చి సుమారు వెయ్యి ఏళ్ళే అయింది. కానీ దానికి "పేపర్" అనే పేరు "పపైరస" నుంచే వచ్చింది. ఈ పపైరస మొక్కను సిసిలీలో రెండువందల ఏళ్ళుగా పెంచి, దాని నుంచి కాగితం కూడా తయారు చేస్తున్నారు. దిగువ బొమ్మలో కనిపించే పపైరస్, సైరాక్యూస (సిసిలీ) సమీపంలో ఉన్న ఒక నదిలో పెరుగుతున్నది. పపైరస్ కాడలో నీటి దిగువన ఉండే భాగమే కాగితం తయారు చెయ్యటానికి పనికివస్తుంది.



Photo by P. Jayaraj



బహుమతి
పొందిన వ్యాఖ్య .

పుట్ట లేని పాము

పంపినవారు :
ఎ. జగన్మోహనరావు

Photo by P. Sundaram



గ్రామస్వరాజ్య ప్రెస్,
విజయవాడ - 1

చెట్టు లేని పూలు

బహుమతి
పొందినవ్యాఖ్య

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు





★ వ్యాఖ్యలు అక్టోబర్ నెల 20 వ తేదీలోగా చేరాలి.

★ వ్యాఖ్యలు ఒక్కమాటలోగాని, చిన్న వాక్యంలోగాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు డిసెంబర్ నెల సంచికలో ప్రకటించబడును.

# చందమామ

### ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



రెండవ అట్టు:
ఏడాది కొకసారి కదిలే రథం

మూడవ అట్టు:
ఎన్నటికీ కదలని ఏనుగు


Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Chandamama Publications, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

